# కృష్ణశాస్త్రి కవితా వైభవం

రచన

డా॥ కడియాల రామమోహన్ రాయ్

ప్రచురణ

రిజిష్టర్డు నెం. 1/64

యువభారతి

5, కింగ్స్ వే,

సికింద్రాబాద్ - 500 003.

KRISHNA SASTRY KAVITHA VYBHAVAM

Poetic Selection of Devulapally Krishna Sasthry with Literary Commentary By Dr. Kadiyala Ram Mohana Roy



ప్రచురణ : 107

ప్రథమ ముద్రణ :
అక్టోబర్ 5, 1984

ప్రతులు : 3,200

ముఖ చిత్రము : శీలా వీర్రాజు

ముద్రణ :
రాజేశ్వరి ప్రింటర్స్,
కాచిగూడ, హైదరాబాద్.

ముఖచిత్ర ముద్రణ :
బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్,
చిక్కడపల్లి, హైదరాబాద్.

ప్రతులకు :

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికింద్రాబాదు-3

యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనము
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

వెల : రూ. Rs-8/=00

# మా మాట

నవ్యకవిత్వం తరువాత తరువాత భావకవిత్వం అనే పేరుతో ఆధునిక సాహిత్య చరిత్రలో వెలుగొందింది. భాషలోనూ భావంలోనూ వస్తుసంవరణంలోనూ కాల్పనికతకూ వైయక్తికానుభూతికీ ప్రాముఖ్యాన్ని సంతరించిపెట్టింది. భావకవిత్వం. భావవిహాయసంలో విచ్చలవిడిగా కొంగ్రొత్త తలపులరెక్కలు విచ్చుకుని ఎగిరే భావకవిని అందుకోలేని పరిస్థితి పాఠకుల్లో కలిగింది. కవితకు హద్దుల్లేవన్న సంగతి చాలాపాతదే అయినా సంస్కృతంలో ఉన్నసాహిత్య శాస్త్రాలతో సంబంధం తెగిపోయిన తెలుగువాళ్ళకి భావకవితా ధోరణి కొత్తదిగానే కన్పించింది. అందరినీ అలరించింది. ప్రణయం, దేశభక్తి ప్రకృతి సౌందర్యం భావకవిత్వావిర్భూతికి కారణాలైనవి. ఒక్కొక్క భావకవి ఒక్కొక్క భావానికి కవితా రూపాన్ని ప్రసాదించి నేటితెలుగుకవితకు అందాన్నీ మార్దవాన్నీ భావవిస్తృతినీ కలిగించినాడు. భావకవులలో అగ్రేసరుడు దేవులపల్లికృష్ణశాస్త్రి. భావకవి అంటేనే కృష్ణశాస్త్రి అన్న అభిప్రాయం ప్రాచుర్యాన్ని అందుకున్నది. కృష్ణశాస్త్రి కేవలం కవేకాదు. సంస్కరణాభిలాషి, మానవోత్తముడైన రఘుపతి వేంకటరత్నం నాయుడుగారి శిష్యుడు. తెలుగునాట కవితాప్రచారం చేసిన ధన్యజీవి. తనదైన ఒక విశిష్ట కవితా రచనా పద్ధతిని సృజియించుకుని పెంపొందించుకున్న ప్రతిభామూర్తి. గేయనాటక కర్తగా, వక్తగా, గేయరచయితగా తెలుగు సాహితిని సుసంపన్నం చేసిన సాహిత్య తపోమూర్తి.

ఆయన కవితాసాగరంలో నుంచి కొన్ని ఆణిముత్యాలను ఏరి వాటికి సరళమైన వ్యాఖ్యానం సమకూర్చి అద్దంలో కొండను చూపించినట్లుగా ఈ కృష్ణశాస్త్రి కవితావైభవాన్ని వ్రాసి మా 'యువభారతి' కి ప్రచురించుకునే అవకాశాన్ని కల్పించిన సహృదయమిత్రులు గుంటూరులోని జె. కె. సి. కళాశాల ఆంధ్రోపన్యాసకులు శ్రీ కే. రామమోహన్‌రాయ్‌గారి ఔదార్యానికి, సాహిత్య ప్రణయానికి మా ధన్యవాద పరంపరలు.

ఇరివెంటి కృష్ణమూర్తి

# యువభారతి పరిచయం

ఉత్తమ అధ్యయనం వల్ల వ్యక్తిత్వానికి సమగ్రత చేకూరుతుంది. సమాజంలో సామరస్యం పెంపొందుతుంది, ఉత్తమ భావ ప్రసంగానికి పుస్తకాలు చక్కని సాధనాలు అందరికీ అందుబాటులో ఉండే విధంగా మంచి పుస్తకాలను అందించే ప్రయత్నానికి యువభారతి పూనుకొని గడచిన ఇరువయ్యేళ్ళుగా పాత కొత్తల మేలు కలయికను ప్రాతిపదికంగా పెట్టుకొని నూరు పుస్తకాలను ప్రచురించినది. ఉపన్యాస కార్యక్రమాలను మంజరీసదస్సులను, నిర్వహించింది.

సహృదయుల సహకారంతో పుస్తకాల అమ్మకం వల్ల వస్తున్న ద్రవ్యంతో పుస్తకాలను ప్రచురిస్తూ తక్కువ వెలకు ఎక్కువ విలువ వున్న సాహిత్యాన్ని అందించడానికి యువభారతి వుద్యమిస్తున్నది. ఉత్తమ సాహిత్య ప్రచారాన్ని ధ్యేయంగా పెట్టుకొని ప్రచురణలను వెలువరిస్తున్నదే కాని మా సంస్థ వ్యాపార సంస్థకాదు.

భారతదేశంలో ఎక్కడున్నా సరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకునేందుకు ప్రారంభింపబడిన సాహితీ మిత్ర పథకంలో 8500 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతీ భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా 1100 మంది భారతీభూషణులు 125 మంది చేరారు.

హైదరాబాదు.

అక్టోబరు, 5, 1984

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షులు, యువభారతి

# ముందుమాట

భావకవులలో గౌరీ శంకర శిఖరం శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి, గురజాడ రాయప్రోలులతో ప్రారంభమైన నవ్యకవిత్వం సాహితీ సమితి స్థాపనతో ఒక ఉద్యమ వేగాన్ని అందుకున్నది. ఆంధ్ర సాహిత్య పరిషత్తు ప్రాచీనాంధ్ర సాహిత్యాన్ని వెలుగులోకి తీసుకువచ్చే ప్రయత్నంలో, ఆధునిక భావాలకు ఏమాత్రం చోటియ్యలేదు. ఆధునిక సాహిత్యవేదికగా "సాహితీ సమితి" అవతరించింది. అంతకు ముందే అబ్బూరి రామకృష్ణారావు, వేంకట పార్వతీశ కవులు కవిత్వంలో నూతనమైన పోకడలు చూపుతున్నా. త్రిపురనేని రామస్వామి చౌదరి, కట్టమంచి రామలింగారెడ్డి భావ విప్లవానికి త్రోవ తీస్తున్నారు. సమాజాన్ని పట్టి బంధించిన సాంఘిక నియమాలనుండి, భాషా సరస్వతిని బంధించిన సంకెళ్ల నుండి, స్వేచ్ఛను కోరుతూ కృష్ణశాస్త్రి కలం పట్టారు. నవ్యకవిత్వంలో కృష్ణశాస్త్రి పెక్కు నూతనమైన పోకడలు పోయారు. స్వేచ్ఛ, దుఃఖం, ప్రేమభావన, ఈశ్వరారాధనలు కావ్యవస్తువులుగా ఆయన పెక్కు ఖండ కావ్యాలు రచించారు.

"కృష్ణపక్షము" కావ్యసంపుటి తొలి ముద్రణ (1925) వెలువడకముందే కృష్ణశాస్త్రి నవ్యకవిత్వం గురించి సాధికారికంగా పలుకగల కవిగా పేరుపొందారు. అర్థ శతాబ్ధికిపైగా సాగిన సాహిత్య యాత్రలో ఆయనకు వెనక చూపన్నది లేదు. సంప్రదాయాన్ని ప్రేమించినా దానికెప్పుడూ బానిస కాలేదు. ఏ కొత్త కవిత్వంవచ్చినా, ఏ నూతన ఉద్యమం బయలుదేరిన గుండె తలుపులు తెరిచి వాటిని మనసారా ఆహ్వానించారు.

భావకవిత్వం అనుభూతి ప్రధానమైనది. ఆత్మాశ్రయమైన కవితారీతి భావ కవులది ఇతివృత్తంకంటె, సన్నివేశాలకంటె, సంభాషణలకంటె కవిభావాలకే అత్యధిక ప్రాధాన్యం ఉండటంచేత దాన్ని భావకవిత్వమని వ్యవహరించసాగారు. గురజాడ వారే "పెరిగివిరిగితి" వంటి కావ్యఖండికలలో ఆత్మాశ్రయరీతికి అంకురార్పణ చేశారు. దాన్ని పెంచి పెద్దచేసి సువాసనాభరితమైన పూలను, మధురమైన ఫలాలను ఇచ్చింది తర్వాత వచ్చిన భావకవులు.

కృష్ణశాస్త్రి, నండూరి, నాయని, వేదుల, బసవరాజు, బాపిరాజు, కవి కొండల మొదలైన భావ కవులలో కృష్ణశాస్త్రిగారే నేతగా పరిగణింపదగినవారు.

ఒక దశాబ్దంపాటు ఆంధ్రదేశ మంతటా పర్యటించి తనవీ, ఇతర భావకవులవీ కవితలు గానంచేసి భావకవిత్వానికొక గౌరవస్థానాన్ని కల్పించినది కృష్ణశాస్త్రిగారే. ఆయన హృదయవాది, మతాతీతమైన మానవతావాది, కాలంతోపాటు కదలివచ్చిన కవి.

మానవోద్యమమూ, స్వేచ్ఛా ప్రియత్వమూ ఆయన రెక్కలకు బలాన్ని చేకూర్చాయి. తన ప్రగాఢమైన ప్రతిభతో దరిదాపు యాభై సంవత్సరాలపాటు నవ్యాంధ్ర కవులను ప్రభావితం చేసి తెలుగు కవిత్వంలో సౌందర్యం, స్వేచ్ఛ, దుఃఖం, ప్రణయం, భక్తి మొదలైన భావాలతో కాంతివంతం చేసిన మహాకవి కృష్ణశాస్త్రి.

కృష్ణశాస్త్రి మహాశిల్పికూడా. పదాలను, భావాలను చిత్రికలుపట్టి తీర్చిదిద్దితేనే గాని ఆయనకు తృప్తిలేదు. అందువల్లనే "కృష్ణపక్షము-ప్రవాసము-ఊర్వశి" వెలువడిన చాలాకాలంవరకు ఇతర రచనలు పుస్తకరూపంలో రాలేదు.

1984 వరకు వచ్చిన కృష్ణశాస్త్రి రచనల సంపుటాలలో ఉన్న అందచందాలను పరిచయం చెయ్యటమే యీ చిన్న పుస్తకం లక్ష్యం. మహాకవి కవిత్వోద్యాన వనంలో కొన్ని పూలు సువాసనాభరితమైన వైతే, కొన్ని రంగురంగుల పూరేకులతో ఆకులతో మనస్సును లోగొనేవి; కొన్ని వంశీనాదం వినిపించే వెదురు పొదలైతే, మరికొన్ని కోయిల పాటలతో కవ్వించే మామిడి చెట్లు. మనోజ్ఞమైన సుందరోద్యాన వనంలో పేరు పేరునా. చెట్టునూ, పుట్టనూ, పూవునూ, రెమ్మనూ పరిచయం చేయటం సాధ్యం కాకిపోయినా మహాకవి కవితా పరిమళాన్ని ఏ కొంతైనా అందించగలిగితే ధన్యుణ్ణిగా భావించుకొంటాను. సమగ్రమైన కృష్ణశాస్త్రి సాహితీమూర్తిని దర్శించటానికి యీచిన్న పుస్తకం కరదీపికగా తోడ్పడుతుందని ఆశిస్తాను.

మహాకవి కృష్ణశాస్త్రి కవితా వైభవాన్ని తలచుకొని నా ఆనందాన్ని పాఠకులతో పంచుకునే మహత్తరమైన అవకాశం ఇచ్చినందుకా "యువభారతి"కి నా కృతజ్ఞతలు.

**రామమోహనరాయ్**

" ప్రతి మనిషీ నడిచే దైవం
ప్రతి పులుగూ ఎగిరే దైవం
అడుగడుగున గుడి ఉంది
అందరిలో గుడి ఉంది "

# కృష్ణశాస్త్రి జీవిత విశేషాలు

స్వేచ్ఛకోసం అలమటించి, మానవతకు నీరాజనంపట్టి, సౌందర్యదాహంతో తపించి ఊర్వశీమూర్తిని ఎదనిల్పుకొని, కన్నీరు మానవహృదయ మాలిన్యాన్ని కడగ గలదని భావించి, ప్రణయంలో ప్రకృతిలో ఈశ్వరుని దర్శించి, ప్రతి మనిషినడిచే దైవమని నమ్మిన మహాకవి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి. ఆయన తూర్పుగోదావరిజిల్లాలో పిఠాపురానికి సమీపంలో ఉన్న చంద్రంపాలెంలో క్రీ. శ. 1897 లో ఒక విద్వత్కవి కుటుంబంలో జన్మించారు. ఆయన తండ్రి వేంకటకృష్ణశాస్త్రి, పెత్తండ్రి శ్రీ సుబ్బ రాయశాస్త్రిగారలు పిఠికాపురాస్థాన విద్వత్కవులు. శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి "దేవుల పల్లి వంశమున దేవులుపుట్టిరి" అని యీ అంశాన్ని ప్రస్తుతించారు.

తండ్రి పెదతండ్రులిద్దరూ చంద్రంపాలెం నుండి పిఠాపురం రాజస్థానానికేవెళ్ళి నప్పుడల్లా బాలుడైన కృష్ణశాస్త్రిని తోడుగా తీసుకొని వెళ్ళేవారు. తమ పాలికాపు మూపుమీద కూర్చొని పిఠాపురంవెళ్తూ,తండ్రి పెదతండ్రుల సాహిత్య సంభాషణఆయన ఆలకిస్తుండేవాడు. తన పదవయేటనే "నందనందన ఇందిరానాథవరద" అనే పద్యం చెప్పారు. పదవయేట రామతీర్థంలో కవితచెప్పారు తండ్రి పెదతండ్రులిద్దరూ కొద్ది కాలవ్యవధిలో కాలధర్మం పొందారు.

తర్వాతకాలంలో "కృష్ణపక్షము" అనే కావ్యాన్ని పిఠాపురం రాజా రావువేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరు వారికి అంకితమిస్తూ

"తరుణ శృంగార మధుర మాధవుడ వీవు
కలికి పాటల కోయిల కొలముమాది
తాపకీన సఖావన తరువితాన
శాఖిజల నిత్యనూతన స్వాదుగాన
జీవసారముఁ గురియించి చివురులెత్తఁ
బాడుకొన్నారు మా కులస్వాములెల్ల
స్వచ్ఛకీర్తి! మనోజ్ఞ వసంతమూర్తి!
పిక కుమారకు నన్నుఁ బాడుకొననిమ్ము
మాలగాఁ దొలిపాటలు పూలతోడ

హృదయమే కూర్చి నీ కొఱకెదురుచూతు!"నన్నారు. తన పితృఋణాన్ని కృష్ణ శాస్త్రి యీవిధంగాతీర్చుకున్నారు.

కృష్ణశాస్త్రిగారు జన్మించినయేడే తెలుగులో మహత్తర సాంఘికనాటకం "కన్యాశుల్కం" వెలువడింది. 1910 ప్రాంతాలలో గురజాడ అప్పారావుగారు ఆధునికాంధ్ర కవిత్వానికి తమ ముత్యాల సరాలతో అంకురార్పణచేశారు. గురజాడవారి తన గీతాలను అందుకొని రాయప్రోలు సుబ్బారావుగారు తృణకం-కణము, లలిత, కష్టకమల, ఆంధ్రావళి, జడకుచ్చులు, స్నేహలతాదేవి మొదలైన కావ్యాలను రచించి అభినవ కవితకు ఆచార్యులయ్యారు. విశ్వనాథ సత్యనారాయణగారు "శృంగారవీథి" మరికొన్ని ఖండకావ్యములు రచించి ఆధునికకవిత్వంలో తన ప్రత్యేకతను చూపుతున్నారు. అబ్బూరి రామకృష్ణారావు "ఊహాగానము" మొదలైన కృతులతో ఆలోచనామృతమైన కవిత్వం రచిస్తున్నారు "యుగయుగంబుల నుండి మ్రోగెడు విశ్వగాన వియత్తరంగిణి" గురజాడ వారి గీతాలలో ఉవ్వొంగి పొంగినదని పలికి ఆయనను "మహాకవి"గా కృష్ణశాస్త్రి సంభావించారు- "అమలిన శృంగారతత్వం"లో రాయప్రోలు వారినిఅనుసరించారు. పుట్టడమే కృష్ణశాస్త్రి భావకవిగా పుట్టారని చెప్పవచ్చు. సంప్రదాయం నుండి స్వేచ్ఛను కోరినప్పటికీ, ఆయన సంప్రదాయాన్ని త్యజించలేదు. "నా కవితలో నాన్నగారి లిరికల్ ఫెర్వర్, పెదనాన్నగారి జిగీ వచ్చాయి" అన్నారు కృష్ణశాస్త్రి. దేవులపల్లి సోదరకవుల శబ్దశక్తి, అర్థగాంభీర్యమూ కృష్ణశాస్త్రిగారికి సంక్రమించాయి. ఆయన ఎన్నుకున్న మార్గం మాత్రం గురజాడ, రాయప్రోలు వారలదే.

కృష్ణశాస్త్రిగారు పిఠాపురంలో, కాకినాడలో విద్యాభ్యాసంచేసి 1918లో పట్టభద్రులయ్యారు హైస్కూలులో కూచి నరసింహంగారు,కాలెజీలో బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు ఆయన గురువులు నాయుడుగారి పాఠప్రవచనమూ, బోధనలూ, కృష్ణశాస్త్రిగారి భావిజీవితాన్ని తీర్చిదిద్దాయి. 1919లో తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి "సాహితీసమితి"ని స్థాపించారు విశ్వనాథ, అడవి బాపిరాజు. నండూరి సుబ్బారావు, కొడాలి ఆంజనేయులు, బోరి నరసింహశాస్త్రి, శ్రీనివాస శిరోమణి, చింతా దీక్షితులు, మొక్కపాటి నరసింహశాస్త్రి, మునిమాణిక్యం అందులో సభ్యులు. కృష్ణశాస్త్రిగారు కూడా "సాహితీసమితి"లో చేరారు. "కృష్ణశాస్త్రి బి ఏ , అనిపించుకోవడం కంటే "సాహితీ సమితి సభ్యుడు" అనిపించుకోవటం గౌరవంగా తానారోజుల్లోభావించేవాడినని శాస్త్రిగారే ఆ తర్వాత చాలా సందర్భాలలో అన్నారు.

బ్రహ్మసమాజోద్యమము, వ్యావహారిక భాషోద్యమము కృష్ణశాస్త్రిగారి భావనకు రెక్కలు తొడిగాయి. భావకవులెవ్వరికీ అందనంతఎత్తుకుఎగిరి ఆంధ్రసాహిత్యాన్ని తన కావ్యాలతో సుసంపన్నం చేశారు.

జీవికకోసం కృష్ణశాస్త్రిగారురెండేళ్ళపాటుకాకినాడ, పెద్దాపురం హైస్కూళ్ళలోఉపాధ్యాయునిగా పనిచేశారు. పిఠాపురం రాజుగారికి వ్యతిరేకంగా "ధర్మసాధని"పత్రికలో వ్యాసాలు రాయడంతో ఆయనను ఉద్యోగంనుండి తొలగించారు.తండ్రుల కాలం నుండి

రాజాగారు ఇస్తున్న "వార్షికం" ఆపివేశారు. ఆరోజుల్లోనే శాస్త్రిగారి భార్యమరణించింది. శోకభారంతో రచించిన "కన్నీరు" అనేది ఆయన తొలి ఖండకావ్య సంపుటి.

కృష్ణశాస్త్రి రచిస్తున్న ఖండకావ్యాలను చూచి ముచ్చటపడి మెచ్చుకొని వేంకట పార్వతీశ కవులు తమ "ఏకాంతసేవ"కు పీఠిక రచించమని కోరారు 1922లో రచించిన యీ పీఠికలో "నవ్యకవులకు స్వేచ్ఛ ప్రాణము. వీరు ప్రాణమైన గోల్పోవుదురు గాని, శృంఖలముల ధరింపరు. వీరికి ప్రాణముకన్న గానము తీపు" అని శాస్త్రిగారు నవ్యకవుల మార్గాన్ని స్పష్టం చేశారు.

కృష్ణశాస్త్రిగారు అప్పుడప్పుడూ రచించిన ఖండకావ్యాలను కలిపి 1955లో "కృష్ణపక్షము" పేరుతో ప్రకటించారు. శ్రీ శివశంకరశాస్త్రి దానికి "సింహావలోకనము" రచించి, కృష్ణ పక్షంలోని కవితా రీతులను పరిచయం చేశారు.

చేస్తున్న ఉద్యోగం పోయిందని కృష్ణశాస్త్రి బాధపడలేదు. "నా స్కూలుమేష్టరీ ఉద్యోగం నా అదృష్టంవల్ల పోయింది" అన్నారాతర్వాత. ఒక పది సంవత్సరాలపాటు కావ్య గానంచేస్తూ ఆంధ్రదేశమంతా తిరిగారు. తనవీ. ఇతర భావకవులవీ కావ్యాలు పాడి వినిపిస్తూ భావ కవిత్వానికొక ఉద్యమ స్ఫూర్తినిచ్చారు. యువకవులు ఉబ్బూత లూగిపోయి ఆయనను అనుసరించారు. ఆయన మోజుపడి పెంచుకొన్న గిరిజాలు, ధరించిన పొడవు లాల్చీని చూచి ఆకర్షితులై, కవులు ఆయనను వేషంలో, భాషలో అన్నిటిలో అనుకరించసాగారు.

జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతున్న ఆ కాలంలో కృష్ణశాస్త్రి సంఘ సంస్కరణ కార్యకలాపాలలో కొంతకాలం పాల్గొన్నారు. కళావంతుల వివాహాలు, అస్పృశ్యతా నివారణలకోసం ఆయన పాటుపడ్డారు.

ఆత్మాశ్రయమైన కవితాధోరణికి కృష్ణశాస్త్రిగారు గురుపీఠమై నిలిచారు. ప్రేయసి మరణానికి దుఃఖించి రచించిన "ప్రవాసము" ఆధునిక కవులకీ విధమైన కావ్యరచనకు ఒరవడి పెట్టింది. విశ్వ ప్రేయసి ఊర్వశిపై ఆయన రచించిన కావ్యం ఊర్వశి ప్రణయ కావ్యాలలో మకుటాయ మానమై నిలిచింది.

బ్రహ్మ సమాజంలో ప్రముఖ కార్యకర్తయై కృష్ణశాస్త్రి వందలకొద్దీ భక్తిగీతాలు రచించారు. ఈ గీతాలలో కొన్ని "మహతి" అనే సంపుటిలో ఉన్నాయి. ఇవి బ్రహ్మ ధర్మాన్ని చాటే గీతాలలోనే గాక తెలుగులో వచ్చిన భక్తిగీతాలలోనే ఉత్తమమైనవి.

1933 నుంచి పది సంవత్సరాలపాటు కృష్ణశాస్త్రి కాకినాడ పి. ఆర్. కాలేజీలో ఉపాధ్యాయులుగ ఉన్నారు 1942లో మద్రాసు చేరుకొని సినిమాలకు పాటలు రాయ

సాగారు. కొంతకాలం ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో, సాహిత్య కార్యక్రమాల ప్రయోక్తగా పనిచేశారు. సినిమాలకు పాటలు రాసినప్పుడుగూడా ఆ పాటలలో కవితా విలువలను ఏ మాత్రమూ విడిచిపెట్టక పోవటం విశేషం. ఆకాశవాణిలో ప్రసారం కోసం రాసినవైనా, ఆఖరు నిమిషంవరకూ తుదిమెరుగులు దిద్దుతూ, పదాలకు చిత్రికలు పడుతూ నాటికలు, ప్రసంగ వ్యాసాలు, యక్షగానాలు, కవితలలో ఆయన ఎనలేని ప్రజ్ఞ చూపారు. ఈ విషయంలో ఈయనకు సాటి మరొకరు లేరు.

పుంఖాను పుంఖంగా వెలువడిన కృష్ణశాస్త్రి రచనలు వారి ఆలసత్వనవల్ల, చాలా ఆలస్యంగా గాని అచ్చుకాలేదు. ఇప్పటికీ పుస్తకరూపం ధరించని రచనలు ఉన్నాయి. పుస్తక రూపంలో వచ్చిన వాటిలో "కన్నీరు; కృష్ణపక్షము: ప్రవాసము; ఊర్వశి; మహతి: పల్లకీ; ఋగ్వీథి; అప్పుడు పుట్టిఉంటే: బహుకాల దర్శనం; పుష్పలావికలు; శర్మిష్ఠ; ధనుర్దాసు; తిరుప్పావు; మేఘమాల; అమృతవీణ; మంగళ కాహళి; వ్యాసావళి- 4 సంపుటాలు" ప్రధానమైనవి. ఇంకా వెలుగు చూడవలసినవి "క్షీరసాగరమథనం; విప్రనారాయణ చరిత్ర; మాళవికాగ్నిమిత్రం; రామానుజ కథ; ముఖలింగం; శివకవి కథ; ప్రసన్నపారిజాతం; విశ్వాదాభిరామ వినురవేమ" మొదలైనవి ఉన్నాయి.

కవిత్వం రచించటానికి అల్లసాని పెద్దన కోరిన హంగుల వంటివి, కృష్ణశాస్త్రి గారికి కావాలి. పాట రాయటానికి ఆయన చాలా శ్రమపడేవారు. నిరంతర గోష్ఠి, మంచి సంగీతం, మనసెరిగిన మిత్రులు, ఊహ తెలియగల లేఖక మిత్రులూ ఆయనకు కావాలి. పాట ఎలా వస్తుందంటే "కనపడని చెయ్యి ఏదో గళద్వారపు గడియ తీస్తే వస్తుంది. ఒక్కొక్క పాట అనుకోని అతిథిలాగా తలుపు తెరుచుకొని ఎదట నిలబడు తుంది. మరొక్కపాట పుట్టలోనుండి పాములాగ కొంతకొంతగా పాకి వస్తుంది. ఒక్కొక్క పాట నిన్న రాత్రి మోడులాగే, ఉన్నపొదమీద తెల్లవారగానే, నిండుగా వికసించిన కన్నెపూవులాగ, గాలిలో తలలూపుతూ ఉంటుంది. ఒక్కొక్కసారి గేయం అంతా తయారై దానిలో ఒక పదం ఏ నెల్లాళ్లకో వచ్చి సమగ్ర మోహన రూపం ధరిస్తుంది" అంటారాయన. ఇంత ప్రయాసపడిన తర్వాత వచ్చిన పాట మాత్రం కాలానికి చెక్కుచెదరక నిత్య యౌవ్వనంతో నిలిచిపోతుంది.

స్వరపేటికకు కాన్సర్ వ్యాధి సోకి 1964 లో ఆపరేషన్ తర్వాత కృష్ణశాస్త్రి గళం మూగపోయింది. 1980లో మరణించేవరకు ఆయన మానసికంగా నిత్యోత్సాహి గానే జీవించారు; తుదివరకు కవితా వ్యాసంగం సాగించారు. "గూడు నిద్రపోయినా గువ్వ మేలుకుంది; గొంతు మూగపోయినా గుండె మేలుకుంది" అని తన బాధను కవి త్వంగా మార్చుకొని ఆయన జీవించారు. ఆయనకు మనిషిమీద ఉన్న మమకారం మరి దేనిమీదా లేదు. కుష్ఠురోగిని కూడా ప్రేమించగలిగిన స్థాయికి ఆయనఎదిగారు ఒక నాడు ఒక కుష్ఠు బిచ్చగాడు ఆయనకు ఎదురయ్యాడు. "అతనికి కొందరు, మొగం పక్కకు తిప్పుకొని ఐదుపైసలో, పదిపైసలో పడేస్తే కృతజ్ఞతతో చెప్పకుండా తీసుకొని

వెళ్ళిపోయేవాడు. ఏగొప్ప ముహూర్తమో అది, ఒకనాడు నేను వాని భుజం ఒకసారి చేతితో ఒత్తాను, వాడు ఒక చిరునవ్వు నవ్వాడు. ఎంత తియ్యని గొప్ప నవ్వో అది! వానికి కావలసిన డబ్బుకన్నా కూడా, తోటిమానవుని హస్తస్పర్శ" అని చెప్పి ఆనాటి అనుభవాన్ని శాస్త్రిగారు పదిలంగా మనసులో దాచుకున్నారు.

కృష్ణశాస్త్రిగారి మరణవార్తవిని "వసంతం రానున్నది: కోకిలవెళ్ళిపోయింది" అని రసజ్ఞులొకరు ప్రకృత్యుపాసకుడైన కవి ప్రకృతిలో కలిసి పోవటాన్ని గురించి వ్యాఖ్యానించారు.

కృష్ణశాస్త్రి కవితాశక్తిని ఎవరెన్నివిధాలుగా అంచనావేసినా 'వైతాళికులు'లో ముద్దుకృష్ణగారు చెప్పినదానికంటె మిన్నగా చెప్పటం కుదరదు. "శిల్పి, గాయకుడు- కవిత్వంలో కూడా సన్నపోగారు చెక్కడంలో మహానిపుణుడు. కీట్స్. షెల్లీలపదాల కూర్పు ఆంగ్లకవిత్వానికి ఎటువంటి నూతన శోభ కూర్చిందో తెలుగుకవిత్వ భాషకు ఈయన కృషి అటువంటిది. ఊహాతీతమైనదేనికో అర్రులు చాచే ఆశాజీవి. ఆశయాలలో, అనుభవాలలో కొత్తదనమూ, విశేషప్రత్యేకతా ఉన్నవాడు - ప్రేమకై విదాహం పొందాడు. విరహంలో వేగిపోయాడు : ఈ అనుభవాలను శాశ్వత శిల్పాలుగా నిర్మించాడు. పాటలలో ఈయనను సరి జేరగలవారులేరు. బ్రహ్మమతం కల్పించిన స్వేచ్ఛ పక్షిబలాన్ని కూర్చినా. అంతకు యెక్కువైన స్వేచ్ఛకై పక్షాలను కదిపాడు. వైష్ణవ గీతాలలోని హృదయ పక్వత మెదడుకు పట్టించుకున్నాడు. కళా సంపత్తి ఎక్కువ. కవిత్వం కోసం బ్రతుకుతాడు- రుచిగలవాడు".

విశ్వనాథ సత్యనారాయణగారు కృష్ణశాస్త్రి కవితాశక్తిని గురించి "భావకవిత్వమనేది అర్థమయ్యే విషయంగాదు. హృదయానికి అవగతమయ్యేవిషయం. అది వ్రాయగలవాడు ఒక్కడే. అతని పేరు కృష్ణశాస్త్రి. అతనిననుసరించి చాలామంది వ్రాస్తారు. ఎవ్వడూ అతని నందుకోలేరు. అతని కాంతే మాసౌధమంతా వ్యాపించి ఉంది" అన్నారు. భావకవిత్వం ఉజ్వలంగా వెలిగిన దినాలలో రసవత్కావ్య ఖండికలు రచించిన విశ్వనాథవారీవిధంగా కొనియాడటం విశేషంగా గమనింప దగినది.

శ్రీశ్రీ కృష్ణశాస్త్రి కవిత్వాన్ని "కటకటా లొటిపిటా చస్తే కృ.శా. విషాదగీతం రాయాలా!" అని "కృష్ణశాస్త్రివిషిష్వరించుచారు వేదనారోగమ్"అనీ సరదాకువేళాకోళం చేసినా శాస్త్రిగారి కవిత్వమంటే ఆయనకు చాలా ఇష్టం. "ఆపాత మధురమయిన కృష్ణశాస్త్రి సాహిత్యం సమస్తమూ ఇక్షు రసార్ణవమే"అనిమెచ్చుకున్నారు కృష్ణశాస్త్రి మరణమంటే షెల్లీ కవి మళ్ళీ మరణించటమేనని భావించారు.

కృష్ణశాస్త్రి గారిని శ్రీబాలగంగాధర్ తిలక్ చమత్కార దోరణిలో మల్లెపూం మీద పరుంటాడు, మంచిగంధం రాసుకుంటాడు- మరి ఎందుకు ఏడుస్తాడు? మంచి పనివాడు - మాకు నచ్చినవాడు, మంత్రనగరికి వెళ్ళొచ్చినవాడు. మధురసం

చేదంటాడు, వధ్యశిలపై విరహగీతం రాస్తాడు" అని మెచ్చుకొని ఆయన కవిత్వ తత్వాన్ని వివరించారు.

"కాళిదాస భవభూతుల, యామున వేదాంత దేశికుల, తిక్కన, పెద్దనల, కబీరు సూరదాసుల, షెల్లీ,బైరనుల వరసలో నిలబడే కవి కృష్ణశాస్త్రి" అని శ్రీ తిరుమల రామచంద్ర కవిత్వంలో కృష్ణశాస్త్రి ఉన్నత స్థానాన్ని గురించి తెలిపారు.

"విశ్వనాథ - కృష్ణశాస్త్రి - శ్రీశ్రీ" అనే యీ ఆధునిక కవిత్రయంలో ఒకరైన దేవులపల్లివారి కవితావైభవాన్ని, చూపుడువేలితో చందమామను చూపినట్లు చూపటమే యీ చిన్న పుస్తకం లక్ష్యం.

"తక్కువవాడు మోసం చేస్తే అది దారుణమైననేరం, ప్రభుత్వాలు; ప్రముఖులూ చేస్తే అది రాజకీయ తంత్రం, మంత్రాంగం."

"యవ్వన దశలోఉన్న వ్యక్తి వతనంతవాడు లేనట్లున్నూ, తన అనుభవమంత అమూల్యమైనది లేనట్లు న్నూ, లోకరంగంలో తానే నాయకుడై నట్లున్నూ అనుకుంటాడు. సాక్షిగా, తటస్థుడిగా ఈలోకాన్ని చూడలేడు. అనుభవం వైపు మొగ్గినంత ఆలోచనవైపు మొగ్గడు.........ఈ యవ్వనంలో వున్న జాతి కూడ తనంత గొప్పదీ, లోపంలేనిది లేదనుకుంటుంది.

—దేవులపల్లి కృష్ణశాస్త్రి

# కృష్ణశాస్త్రి కవితా వైభవం

## 1

"చిననాటి ఖాప వల్లిని పూచినది, వాడ
నిది. వాసనల వీడనిది, ఒకండు
కోరిక-నాల్గు దిక్కుల భూ భువనమంత
లవలేశమును వదలకయె తిరిగి
ప్రతి గేహగేహళి పదమాగి, ప్రతిహృద
యద్వార తోరణమట్టె త్రోసి
లోనికి జొచ్చి. నాలోని స్నేహక్షీర
మొక్కింత ఒక్కింత ఒలకబోసి

"అనుగు సోదర మరలి రానా యటంచు
సెలవడిగి సాగిపోయెడు చిరపథికుడ
కావలయునంచు. ఆశ ఆకాశమంత
పటిమ ధీన విహంగ మిప్పటికి అంతె !"—భారతజాతి మొట్టమొదటి రిపబ్లిక్ దినోత్సవ సుభసందర్భంలో గొంతెత్తి తెలుగుకవి సకలమానవజాతికోసం పలికిన శుభాశంసనమిది. మనిషిని పిచ్చిగా ప్రేమించిన మనిషి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి. ప్రతి హృదయద్వార తోరణమూ తెరచి, మనస్సులోపలికి ప్రవేశించి తనలోని క్షీరాన్ని ఒలకబోసి, "అనుగుసోదర!" అని నోరారా పిలిచి "మరలిరానా" అంటూ సెలవుతీసు కునే మహాపథికుడాయన. ఆయన జీవితం ఒక నిరంతర అన్వేషణ, మనిషిలో దాగి వున్న మనిషిని వెతుక్కొని ఆ మానవత్వాన్ని పూజించిన మహాకవి కృష్ణశాస్త్రి, అందుకే అయన

ప్రతి మనిషీ నడిచేదైవం
ప్రతి పులుగు ఎగిరేదైవం
అడుగడుగున గుడిఉంది
అందరిలో గుడిఉంది" అని సంభావించారు

హిమశిఖరినెక్కి సేతువుదాక సృష్టిసారించి గళకాహళి పూరించి

"నిన్న మొన్నదాక మన్నులోమన్నయి
యున్న ప్రాణశంఖము త్తినాడు
మానవుండు గర్వమాణిక్యకోటీర
ధారినేడు-విజయహారినేడు !

ఈనాడీభువి బానిసీడు మరిలేనే లేడు! ఒక్కొక్క ఫా
లానన్ పావక నేత్రమున్నది పగల్ కాల్పంగ - ఒక్కొక్క
డెందానన్ క్షీర సముద్రమున్నదపథుల్ దాటంగ - ఈ మానవుం
డే నిర్మాత విధాత నేత మరితానో భక్తలోకమ్మునన్" అని దిక్కులు పిక్కటిల్లేలాగ చాటిన కవికృష్ణశాస్త్రి కర్కశ హృదయాలలో శీతలస్నేహ దుగ్ధాన్ని వర్షించి అంధమనోమందిరాంతరాలలో మాణిక్యదీపాలను వెలిగించి విద్వేషవైతరణికి గాథ, సౌహార్దసేతువును రచించాడాయన.

"సృష్టిలో తీయనిది స్నేహమేనోయీ!" అన్న ఇంద్రగంటివారి వాక్కును సార్థకం చేస్తూ సృష్టికంతటికి స్నేహ క్షీరాన్ని పంచిపెట్టడానికి పూనుకున్నారు కృష్ణశాస్త్రి. తోడుగా మనుష్యులు లేకపోతే తోచేదికాదాయనకు. కొందరు కవులు తమ మనస్సుకు నచ్చిన పుస్తకాలుంటే తమకు మరింకేమీ అక్కరలేదంటారు. కాని కృష్ణశాస్త్రిగారు మాత్రం తనకు మనుష్యులు తోడులేకపోతే ఖాయిలా పడిపోతాననేవారు.

మనిషిని ద్వేషించటం ఆయనకు తెలియదు. "బహుకాల దర్శనం" లో అబద్ధాలాడి పొట్ట పోసుకునే శ్రీరాముల్ని తలచుకుంటే - అటువంటి వాళ్ళను కూడ ప్రేమాస్పదులుగ మలచిన కృష్ణశాస్త్రి మనిషిగా ఎంత ఎత్తుకు ఎదిగారో గదా ? అనిపిస్తుంది. రిక్షావాలా "అహమ్మద్", చెప్పులు కుట్టే "నారయ్య"ల కష్టాలను అర్థం చేసుకొని వాళ్ళను అనుంగు సోదరులుగ భావించి, వాళ్ళ బ్రతుకులు మారాలని కోరుకున్న మంచి మనిషి ఆయన. కవిగా భావనలో ఒక్కొక్క మెట్టుపై కెక్కుతున్న కొద్దీ మనిషిగాకూడ కృష్ణశాస్త్రి ఉన్నత శిఖరాలకు చేరుకొని భావకవులలో గౌరీశంకర శిఖర మనదగినంత ఎత్తుకు ఎదిగారు.

## 2

"నేను స్వేచ్ఛా కుమారుండ నేను గగన
పథ విహార విహంగమ పతిని నేను
మోహన వినీల జలధర మూర్తి నేను
ప్రళయ ఝంఝూ ప్రభంజని స్వామి నేను !"

ఆంధ్ర కవిత్వంలో క్షీణయుగం తొలగిపోయి నవ్యయుగం ప్రవేశించింది. వీరేశలింగం, గురజాడ, రాయప్రోలు, గిడుగువారలు నవ్యకవిత్వానికి మార్గాలు ఏర్పరచారు. అబ్బూరి రామకృష్ణారావుగారి "ఊహాగానము" తెలుగుకవితకు "శ్రోణీభరాల నడీగమన" యైన శీవిని సౌకుమార్యాన్ని ప్రసాదించింది. పద్యం, గేయ గుణాన్ని సంతరించుకొన్నవి. భావనలో భాషలో భావప్రకటనలో అన్నిటా నవ్యత్వం వ్యాపించింది. సూర్యుని నులి వెచ్చని కిరణాలు సోకగానే పక్షులు గూళ్ళలోంచి లేచి

రెక్కలు విదిల్చి విశాలమైన విహాయసంలోకి ప్రయాణించినట్లే కొత్త కవిత్వపు వెలుగు సోకగానే కృష్ణశాస్త్రి కలకూజితాలు చేస్తూ స్వేచ్ఛను ప్రకటించారు

గురజాడ భావుకశక్తీ, రాయప్రోలు పద్యరచనారీతి కృష్ణశాస్త్రిలో చక్కగా మేళవించి, ఆయన రెక్కలకు బలాన్ని చేకూర్చాయి కవులుగా మిక్కిలి ప్రసిద్ధులైన వేంకట పార్వతీశ్వరులు కృష్ణశాస్త్రిగారిని "ఏకాంతసేవ"కు పీఠిక రచించమని కోరటమంటె-నవ్యకవిత్వాన్ని గూర్చి సాధికారికంగా పలకగలిగిన కవి కృష్ణశాస్త్రి అని గుర్తించడమే!

గురజాడవారి వైతాళిక గానాన్ని విని కృష్ణశాస్త్రి చైతన్యవంతులయ్యారు.

"గుత్తునా యని జాతి ముత్యాల్
గుచ్చినాఁడే మేలి రసముల
ఇత్తునా యని తెలుఁగుఁదల్లికి
ఇచ్చినాఁడే భక్తితో!" అని గురజాడను మహాకవిగా కీర్తించటమేగాక, ముత్యాల సరాల అందాన్ని కొనియాడటానికి ముత్యాల సరాలనే ఎంచుకున్నారు.

గురజాడ రాయప్రోలు లేర్పరచిన నవ్యమార్గం కృష్ణశాస్త్రి స్వేచ్ఛాగానం చేయటానికి తోడ్పడింది. కృష్ణశాస్త్రి అనుసరించిన ఆధునిక రీతులను కృష్ణపక్షము సింహావలోకనములో శివశంకరశాస్త్రి వివరించారు. కృష్ణశాస్త్రి భావతరంగణి స్వతంత్రబుద్ధి; దుఃఖము; ప్రేమాంకురము; ఈశ్వరారాధన అనే నాలుగు విధాలుగా ప్రవహిస్తున్నదన్నారు. వీటిలో స్వతంత్రబుద్ధి మొదటిది, ముఖ్యమైనదిన్నీ.

"నేను" అనే ఖండకావ్యంలో కృష్ణశాస్త్రి తాను స్వేచ్ఛాకుమారుడననీ, ఆకాశవీధిలో విహరించే విహంగమపతిననీ, నీలమేఘశ్యాముడననీ తెలిపారు. అంతటితో ఆగక తనను ఝంఝూప్రభంజన స్వామిగా కూడ అభివర్ణించుకొన్నారు. ఆయన తీసుకువచ్చిన ప్రళయప్రభంజనం ఏమిటి? అని ఆలోచిస్తే "జగమునిండ స్వేచ్ఛాగాన ఝురులు నింపటం: క్రౌరకౌటిల్య కల్పిత కఠినదాస్య శృంఖలములు చెదరిపోయేటట్లు చేయటం-ఇంకా ఎన్నో విధాల ప్రళయమేననదగిన మార్పుతేవటం జరిగింది.

మహాభక్తుడైన కృష్ణశాస్త్రి తీవ్రస్వరంతో "రాజవీధుల రతనాల రథమునెక్కి వెడలు నిర్జీవ పాషాణవిగ్రహంబ! చిమ్మచీకటి పొగల నిశీథమందు, క్షుద్రమందిరాంతర జీర్ణకుడ్య తలములందు కన్నులుమూసి, ఒడలుమరచి కులుకు దివాంధమా చలువరాతి మేడల చెఱసాలలందు, తళుకు బంగారు సంకెళ్లఁ దాల్చి, లోకపాలకుని బోలె మురియునో బానిసేఁడ!" అని దైవాన్ని సంబోధించి "నేను స్వేచ్ఛాకుమారుఁడను" అని ఘంటాపథంగా పల్కడం ఝంఝూప్రభంజనమే!

## 3

"ఆకులోనాకునై పూవులోఁబూవునై
కొమ్మలోఁగొమ్మనై నునులేత రెమ్మనై
ఈయడవి దాగిపోనా! ఎట్లైననిచటనే యాగిపోనా?

ఆకలా దాహమా చింతలా వంతలా
ఈ కరణి వెట్టినై యేకతమ తిరుగాడ
ఈయడవి దాగిపోనా! ఎట్లైననిచటనే యాగిపోనా?"

నవ్యకవులకు ప్రకృతి నూతనరూపంలో కన్పించసాగింది. "పాటలాదరిస్తే పాటపాడెను చెట్లుచామలు కోటిచెవులను గ్రోలి యలరగ : తృటి వనమున నాగి చంద్రుడు తాను చెవి యొగ్గెన్" అనే భావనలో సౌందర్యం నవ్యకవుల మనస్సులకు పట్టుకొన్నది. నిఘంటువులలో కన్పించే చెట్లపేర్లను, జంతువులపేర్లను పద్యాలలో పట్టికలుగా ఇవ్వటముగాక పరిసరాలను పరికించి తెలుగునేలలో కన్పించే కొత్తిమెరచేలు, అరటిచెట్లు, నిమ్మ, నారింజ మొదలైన చెట్లు; పొదుగుభారంతో నడయాడే గోమాతలను కావ్యవస్తువులుగా రాయప్రోలు కమనీయంగా కవితరల్లారు. అయితే ఇవన్ని ఒక ఎత్తు. కవి తానై ప్రకృతిలో ఒకడుగా కలిసిపోయి ప్రకృతి సౌందర్యానికి పరవశుడై గానం చేయటం మరొకెత్తు. ఆత్మాశ్రయ కవితాలోకంలో వెలువడిన కృష్ణశాస్త్రి "ఆకులో ఆకునై" అనే ఖండకావ్యం నవ్యకవిత్వంలో ఒక నూతన రీతికి ఒరవడి పెట్టింది.

ఒకప్పుడు కృష్ణశాస్త్రి నల్లమల అడవులగుండా రైలులో ప్రయాణం చేస్తున్నారట! రైలు చప్పుడులో, ఊయెల లూపినట్లుగా కదలుతున్న ప్రయాణంలో కళ్ళు చూచినంతమేరా పరచుకున్న అడవి సౌందర్యం ఆయనను ముగ్ధుణ్ణి చేసింది. ఆ ప్రకృతి సౌందర్యానికి పరవశించి "ఆకులో ఆకునై, పూవులో పూవునై, కొమ్మలో కొమ్మనై, నునులేత రెమ్మనై యీ యడవి దాగిపోనా" అనుకున్నారు. ఆకులో ఆకుగా భావించుకోవడమూ, అడవిలో దాగిపోనా అనుకోవటమూ నవ్యకవిత్వానికి కూడ నవ్యభావన.

"గలగలమని వీచే చిరుగాలిలో కెరటమై, జలజలమని పారే సెలయేటి పాటలో తేటనై యీ యడవి దాగిపోనా?" అన్నారు. ఇంకా "పగడాల చిగురాకు తెరచాటు తేటినై పరువంపు విరిచేడె చిన్నారి సిగ్గునై యీ యడని దాగిపోనా?" అని కూడ అన్నాడు. ఎట్టని చిగురాకు చాటున దాగిన తేటిని-పగడాల చిగురాకు తెరచాటు తేటిగా ఊహించటం కొత్త ఊహ, అంతకంటె బాగా వికసించిన పుష్పసౌందర్యాన్ని పరువంపు విరిచేడె చిన్నారి సిగ్గుగా తలచటం ఇంకా కొత్త భావన-"తరులెక్కి,అల నీలగిరినెక్కి మెల్లమెల్లఁజడలెక్కి జలదంపు నీలంపు సిగ్గునై యీయడవి దాగిపోనా"అన్నారు. తరువు, నీలగిరి, చదలు, జలదమూ అన్నీ నీలమే-అంతేగాక సిగ్గు కూడ నీలంపు సిగ్గు" అనటం కవి భావనా వైచిత్రిని తెల్పుతున్నది

అడవిలో ఒంటరిగా తిరగటానికి కవికి ఎటువంటి భయమూలేదు. ఆకలీ దప్పికా లేవు చింతలూ వంతలూ లేవు. ప్రకృతియే తానైనప్పుడు వాటికి చోటేది ? అందుకె అన్ని భయ సంకోచాలూ బాధలూ వీడి నిశ్చయంగా స్వేచ్ఛను ప్రకటించారు.

ప్రకృతి సౌందర్యాన్ని దైవంగా ఉపాసించటం కృష్ణశాస్త్రి కవితలో అడుగడుగునా కన్పిస్తుంది. ఆయన కవితలో పువ్వులు మాట్లాడతాయి, పక్షులు పాడతాయి, బాట పాడుతుంది, బండి పాడుతుంది, మబ్బులు శ్రుతి కలుపుతాయి. విశ్వమే పరవశించి ఒక మహాగానస్రవంతిలో తేలియాడుతుంది. కొమ్మ కొమ్మ కొక గవాయి, రెమ్మ రెమ్మకొక సన్నాయి ఆయన కవిత్వోద్యాన వనంలో విన్పిస్తాయి. గున్న మామిడిచెట్లు కోయిలలు, మధుమాస శోభ, వెన్నెల్లు, శరత్కాలపు వెన్నెలలు, నీలాభ్రసరసిలో రాయంచలా విహరించే నిండు జాబిల్లి, జల్లు జల్లుగా కురిసే వెన్నెల వానలు, పచ్చని తాటాకులతో పచ్చితావులు వెదజల్లే పెళ్ళి పందిళ్ళు, ఝుమ్మనే తుమ్మెద రొదకు పరవశించే పూల బాలలూ కొల్లలుగా లభ్యమవుతాయి.

## 4

"నవ్వివోదురుగాక నాకేటి సిగ్గు ?
నాయిచ్ఛయేగాక నాకేటి వెఱపు ?

కలవిహంగమ పక్షములఁ దేలియాడి
తారకామణులలోఁ దారనై మెలగి
మాయమయ్యెదను నా మధురగానమున
నవ్వివోదురుగాక నాకేటి సిగ్గు ?

తెలిమబ్బు తెరచాటు చెలిచందమామ
జతఁగూడి దోబూచి సరసాలనాడి
దిగిరాను దిగిరాను దివినుండి భువికి
నవ్వివోదురుగాక నాకేటి సిగ్గు ?"

ఆధునికలోకంలో సరస్వతీ ముఖంగా విజృంభిస్తున్న స్వాతంత్ర్య భావతరంగాలు కృష్ణశాస్త్రి కవితలో పొంగిపొరలి ప్రవహించాయి. భారతదేశం స్వేచ్ఛకోసం పరితపిస్తున్న కాలంలో, భావకవులు స్వేచ్ఛకోసం పోరాటం జరిపారు. కృష్ణశాస్త్రిగారి స్వేచ్ఛాప్రియత్వాన్ని గురించి "సంప్రదాయానుగతములైన ఛందస్సులనేగాక నూతనచ్ఛందములను గూడ గ్రహించి వానిలో భావములను బాగుగా పలికించి రసమొప్పించుట పాదభాగములలో ఖండిక ప్రారంభించుట పాదాంతము కాకుండనే కావ్యము ముగించుట; నూతన ప్రయోగములు చేయుటలో వెనుదీయకుండుట; కొన్ని ఖండికలకు నామముంచ

కుండుట-ఇత్యాది విశేషములు సహృదయులకు నవ్యకళలా పాదించు గుణములుగా గోచరించు"నని శివశంకరశాస్త్రి పేర్కొన్నారు.

"స్వేచ్ఛాగానము"లో కృష్ణశాస్త్రి "తిమిరలత తారకా కుసుమములను దొల్వగా కర్కశశిల నవజీవకళలఁగేఁడగా మోడువోక చివురులెత్తి మురువుసూపగా జగమునిండ స్వేచ్ఛాగాన ఝురులనింతు"నని పలికారు.

"క్రౌర్యకౌటిల్య కల్పిత కఠినదాస్య
శృంఖలములు తమంతనె చెదిరిపోవ
గగనతలము మార్మోగఁగఁ గంఠమెత్తి

జగమునిండ స్వేచ్ఛాగాన ఝురులనింతు"- దేశమాతను బంధించిన కఠిన దాస్యశృంఖలాలు తమంతతామే చెదరిపోయేటట్లు గగనతలము మార్మోగగ కంఠమెత్తి స్వేచ్ఛాగానం చేస్తానన్నారు. శృంఖలాలు దేశమాతనేగాక, కవిత్వాన్ని గూడ పట్టి బంధించి వుంచాయి. కృష్ణశాస్త్రి స్వేచ్ఛాగానం తర్వాత భావకవులు దాస్యశృంఖలాలను ఛేదించారు. భాషలో భావంలో కావ్యాల శీర్షికలలో పదసంబంధాల పొందికలో ఎన్నిటిలోనో స్వేచ్ఛను సాధించారు. దేశస్వాతంత్ర్యంకోసం యుగయుగాల నుండి ప్రాణసుమములర్పించే వారిని కృష్ణశాస్త్రి "ఈశ్వర యోధులు"గా భావించారు. వారి అమర జీవిత ఫలము ధన్యతను గాంచేటట్లు తాను స్వేచ్ఛాగానం చేస్తానన్నారు. చిత్తం ఆనంద ప్రవాహంలో తేలియాడేటట్లు స్వేచ్ఛాగానం చేస్తానన్నారు. కష్టాలు చీకట్లు మరచి విశ్వమే పరవశమయి వెంట పాడగా" అన్నిటినీ స్వేచ్ఛతో నింపుతానన్నారు

కీట్స్, షెల్లీ మొదలైన కాల్పనిక కవులుకోరిన స్వేచ్ఛాప్రియత్వాన్ని కృష్ణశాస్త్రి గూడ కోరారు. స్వేచ్ఛకోసం, ఆయన బ్రహ్మమతం కోరిన స్వేచ్ఛకన్నా, ఎక్కువ స్వేచ్ఛ కోరారు. "నవ్వివోదురుగాక నాకేటి సిగ్గు ? నాయెచ్ఛయేగాక నాకేటివెఱపు?" అని నిర్భయంగా పలికారు. వింతవింత ఊహలు, కష్టాలను మరచి స్వేచ్ఛాజీవిగా విహరించాలనే కోరికను పెక్కువిధాలుగా వెల్లడించారు.

తెలిమబ్బుతెరను చాటుచేసుకొన్న చందమామచెవిలో జతగూడి దోబూచి సరసాలనాడి "దిగిరాను దిగిరాను దివినుండి భువికి, నవ్వివోదురుగాక నాకేటి సిగ్గు" అని తెగించి పలికారు. ఈ భావం సాహిత్య రంగంలో పెక్కు వివాదాలకు దారితీసింది. "అహపు సుడిలో గిజగిజలాడి సమాజ దుఃఖం చూడలేదు కృష్ణశాస్త్రి" అని విమర్శకులు ఆక్షేపించారు. ఈ ఆక్షేపణ న్యాయమైనది కాదు. రిక్షావాలా అహమ్మద్, చెప్పులు కుట్టే నారయ్య సమాజంలో అట్టడుగు వర్గానికి చెందినవారేకదా ! కులమతాల కతీతమైన, పారతంత్ర్యంలేని, దోపిడీలేని సమాజాన్నే ఆయన కూడ కోరారు

కృష్ణశాస్త్రి సౌందర్య తపస్వి. విశ్వకవి రవీంద్రులవలె ప్రకృతిని ఉపాసనా దృష్టితో పలికించటం వల్ల "పరువెత్తి పరువేత్తి పవనునితోడఁ

దరు శాఖఁదూఱి పత్రములను జేరి
ప్రణయ రహస్యాలు పల్కుచునుందు" అని

సృష్టికర్తతో తన ప్రణయానుబంధాన్ని తెలిపారు. ఈ స్వేచ్ఛ సమాజానికి హాని చేస్తుందనుకోవటం పొరపాటు. "నవ్య కవులకు స్వేచ్ఛ ప్రాణము" అన్న కృష్ణశాస్త్రి వాక్కు జ్ఞాపకం పెట్టుకోదగినది.

## 5

"అది శరద్రాత్రి; శీత చంద్రాతపాంత
రాళ రమణీయ రజత తల్పంబునందుఁ
జల్లఁగా నిద్రవోవు వ్రేపల్లెవాడ
సకల గోపాల గోపికా జనము తోడ
సాము సడలిన పతి పరిష్వంగమందు
సుఖము దుఃఖములేని సుషుప్తిలోన
స్వప్నవీధి యద్రేష్ట సంచార కలన
మేను మరచిన నన్నంత మేలుకొలిపె
శర్వరీశీతపవన పక్షములనుండి
స్వాదుయము నోర్మి సంగీత ఝురుల గలసి
కౌముదీధౌత శుభ్ర దిక్తటుల సొలసి
మురళికామంద మంద మాధురుల రుచులు"

రాధాకృష్ణుల ప్రణయాన్ని కవులెందరో గానం చేశారు. తెలుగునాట జన్మించిన జయదేవ కవి కృష్ణశాస్త్రి. లోకనీతికి భిన్నంగా పరకీయ రాధ, కృష్ణునికి తనను అర్పించుకోవడంలో జయదేవుని భావౌన్నత్యాన్ని, శబ్ద మాధుర్యాన్ని కృష్ణశాస్త్రి అందుకున్నారు. తనకు తానే ఒక గోపికయై కిశోర గాయకుడు కృష్ణునికై కవి వెదకుకోవటం "అన్వేషణ" అనే ఖండ కావ్యంలో కన్పిస్తుంది.

శరదృతువులో చల్లని వెన్నెల రాత్రి వ్రేపల్లెవాడ సకల గోపాల గోపికా జనము తోడ నిద్రపోతున్న సమయంలో పిల్లనగ్రోవి పాట గోపికను మేల్కొలిపింది. సాము సడలిన ప్రతి పరిష్వంగంలోనుంచి విడివడి, సుఖదుఃఖాలు లేని సుషుప్తిలో స్వప్న వీధిలో యద్రేష్టంగా సంచరిస్తూ, మేను మరచిన గోపికను వేణువాదం మేల్కొల్పింది. రాత్రివేళ చల్లని గాలులతో కలసి, యమునానది కెరటాల సవ్వడులలో కలసి తెల్లని వెన్నెలలో కలగలసి మురళీనాద మాధురులు ఆమెకు సోకాయి.

సెలయేటి కెరటాలలో తేలిపోయే విరికన్నె వలపులాగ, తొలిప్రొద్దు తెమ్మెర త్రోవలో పయనమై పరుగెత్తే కోయిల పాటలాగ పిల్లనగ్రోవి పాట తీయదనాన్ని నింపింది. యమునానది సన్నని ఎలుగెత్తి జాలిగా పిలిచింది. తుది మొదలులేని త్రోవన ఆమె పరుగెత్తింది. వేణుగానం విన్పించిన దిక్కున ఎంత వెతికినా ఎవరూ కన్పించలేదు

"ఇచటనె యిచటనే యతఁడిచట నేను -
ఇచట నీజాజిపూఁబొదరింట నేను -
ఈ కడిమి చెట్టుక్రింద సుమ్మీయతండు -
సరిగఁ గన్నులఁగట్టిన సరణిఁదోఁచు -" నని శ్రీకృష్ణుడా సమీపంలోనే ఉన్నట్లు తలపోసింది.

ఆమె భావనలోని ఔన్నత్యాన్ని వివరించడంలో కృష్ణశాస్త్రి ఉదాత్తంగ గంభీరమైన భాషను ఉపయోగించారు. "శారద శర్వరీ మధురచంద్రిక సూర్యసుతాస్రవంతికా చారు వినీల వీచిక ప్రశాంత నిశాపవనోర్మిమాలికా చారితనీపశాఖిక కృశాంగిని గోపిక నేను" అనడంలో అన్వయం క్లిష్టంగా ఉన్నా అయోమయం మాత్రంకాదు. భావతీవ్రతకు అనువుగా భాష సుదీర్ఘసమాసరూపం ధరించిందంతే. వాడుక భాషలో కవిత్వం రచించాలన్న తలంపుకు మాత్రం యీ ఖండకావ్యం మిక్కిలి దూరమైనదే.

శ్రీకృష్ణుడు మురళితో తనలోని మోడు బెడదను, శిధిల జీవనాన్ని కూడ చిగురింప జేయగలడని గోపిక భావిస్తుంది. "చూచితిరో లేదో చిన్నకృష్ణుని సొబంగు? అంటూ "పెదవి చివురు సంజల నరవిచ్చు నవ్వువెన్నెల, చలించు తుమ్మెద బెళుకు చూపు, లోలపవన చాలిత కుటిలాలకమ్ముతో" వున్న మోహనరూపాన్ని వర్ణిస్తుంది.

శ్రీకృష్ణుడు లేక ఆమెకు శరత్తమస్వినులు లేవు, మనోజ్ఞసుధాంశుమాలికలు లేవు, శరీరంపైన పులకాంకురావళులు లేవు, కోయిల గొంతులో చిక్కుపడిన వసంత గీతిని, విభుని వీడి శుష్కించు విరహిణి సెలయేటి కడుపులో నడగిన కడలి మ్రోతను, నక్షత్రాల చూపులలో చెరపడ్డ నిండు చందురుని పాటను విడిపించే విశ్వమోహనాకృతియైన కిశోర గాయకుణ్ణి ఆమె వెతుకుచున్నది.

విభుని వీడి శుష్కించు విరహిణి సెలయేటి కడుపులో నడఁగిన కడలిమ్రోత లాగ గోపికా హృదయ మందిరాంతరాళములో వేణుగానం తుళ్ళింతలాడింది.

కృష్ణపక్షము నాటినుండి తుదివరకు, కృష్ణశాస్త్రి "అన్వేషణ"లో వర్ణించిన మాధురీభక్తి తత్త్వపు తలపులలోనే జీవించారు. భావనలోగాని, ఉక్తిలోగాని పునరుక్తి లేకుండ భావించిన ఆయన ప్రజ్ఞకొనియాడదగినది. ఆయన అన్వేషణ ఫలించిందా? అంటే భక్తుల అన్వేషణ ఫలించదు - గమ్యాన్ని చేరుకుంటుంది. తిరిగిరాని ఆ గమ్యం భగవంతుని హృదయమే.

## 6

"నా విరుల తోటఁ బెంచు కొన్నాఁడ నొక్క
పవడపు గులాబిమొక్క నా ప్రణయజీవ
నమ్ము వర్షగమ్ముగాన నయమ్ముఁ గురిసి
కొన్ని పాళ్ళాయె; సుకుమార కుసుమమొకటి
నవ్వె కిలకిలమని నాననములోన,

ఎటులది దాపురించెనో యేమో యంత
నాకు సందుల త్రోవల నల్లదిగియె
నొక్క క్రూరార్క కిరణమ్ము : ఉర్వివాలి
నా గులాబి సోవితూలి నన్ను విడె."

ప్రణయ కవిత్వంలో కృష్ణశాస్త్రి బాణి ప్రత్యేకమైంది. అమలినశృంగారానికి భాష్యంలాగ, కథనాత్మక శైలిలో ఈ ఖండకావ్యం రచించారు,

కవి తన పూలతోటలో ఒక పవడపు గులాబియొక్క మొక్కను పెంచారు. ఆయన ప్రణయ జీవనమే వర్షంగాకురిసి ఆ గులాబిమొక్క ఒక సుకుమార కుసుమాన్ని పూచింది. తన జీవితాశయమిక అపూవేనన్నట్లుగా ఆయన పూవును ప్రేమించారు. ఆపువ్వుకూడ ఆయనను ప్రేమించింది. కళ్లువిచ్చి ఒకరినొకరు చూచుకుంటూ, ఎదలతో నిశ్శబ్దంగా పలకరించుకొంటూ కాలం గడతసాగారు. ఇంతలో ఎక్కడినుండి దాపురించిందో ఒక క్రూరమైన సూర్యకిరణం ఆకుసందులలోనుండి పూవుపై వాలింది. గులాబి తూలి నేలరాలి కవిని వీడిపోయింది. అప్పుడొక కోకిల కవిని చూచి, శూన్యమైనమోడు మోకును చూచి, గొంతెత్తి ఏడ్చింది. కవిని గులాబిని చూచి దారిబోయెడు మంద పవనుడు జాలిగ నిట్టూర్పు విడిచాడు.

ప్రేయసిని పూవుగా భావించుకొన్న యీ గీతం కృష్ణశాస్త్రి కవిత్వంలో విలక్షణమైనది కఠినపదాల సమాసతత్పరతలేకుండ కథ చెప్పినట్లుగా హృదయ భారాన్ని వెల్లడించిన యీ కవిత విశిష్టమైనది.

కృష్ణశాస్త్రి గారి భార్య చనిపోయినప్పుడు దుఃఖభారాన్ని దించుకొనేటందుకు రాసినగీతమిది. "ప్రేమజన్యమైన యశాంతి ప్రేమ విఫలమైన ఘట్టమును వర్ణించునప్పుడే దుర్భరముగా నుండును...ఇట్లు కృష్ణపక్షములో కవిత్వము ఆత్మాశ్రయమై హృదయంగమమైనది" అని శివశంకరశాస్త్రి యీ గీత వైశిష్ట్యాన్ని కొని యాడారు?

ప్రేమించటం కృష్ణశాస్త్రికి సహజ గుణం "సౌరభములేలచిమ్ము బుష్పప్రజంబు.
చంద్రికల నేల వెద జల్లు జందమామ?

ఏలసలిలంబు పాఱు? గాడ్పేల విసరు?
ఏల నా హృదయంబు ప్రేమించునిన్ను?

అని ప్రేమించటం తన నైజ గుణమని ఆయన అన్నారు.
ప్రేయసీవియోగాన్ని ఏమాత్ర సహించలేక

"ప్రేయసీ! ప్రేయసీ! ప్రియుడనే ప్రేయసీ
వేయి కన్నులు దాల్చి వెదకు చున్నానే
నల్ల మేఘాలలో నాయమా దాగంగ?
తల్లికిలవో నన్ను దలంచిరావో? "అని ప్రేయసిని వేడుకున్నారు. ప్రేయసి లేని జీవితం కవికి దుర్భరంగా తోస్తుంది. వలపె విషమైన బ్రదుకు జీవనము విషము" అంటారు.

## 7

"సందెవేళ, పొలము గట్టు, చల్లగాలి
చేతిలో చేయి, సునులేత చిత్తములును
ఈవు నేనె పిట్టలటుల నేమి యనక
సర్వమును జేర నొక్క యపూర్వభావ
యదయమయ్యె గుమార, నా హృదయమందు!
మొగము గంటి, గనులగంటి, మొగిలిగంటి
పాటవిను చుంటి......

ప్రణయదృశ్యాన్ని వర్ణించటానికి ప్రాచీనాంధ్రకవులు వసంతఋతువును ఉద్యానవనాన్ని మలయానిలాన్ని, వెన్నెలరాత్రులను చిలుకల్ని, కోకిలల్ని రతీ మన్మథుల్ని ఇంకా ఎన్నో ఉద్దీపన విభావాలనుకల్పించారు, సంయోగశృంగారాలను కల్పించారు, సంయోగ, వియోగశృంగారాలలు రెండింటినీ ముఖం మొత్తేలాగ వర్ణించారు.

ఆధునిక కవులు ప్రణయ దృశ్యాలను కల్పించటంతో పైన చెప్పిన వాటికన్న భిన్నమైన కవితా సామగ్రిని ఏర్పరచుకొన్నారు. గురజాడ, రాయప్రోలు, అబ్బూరి యీ విషయంలో కృష్ణశాస్త్రికి మార్గదర్శకులు - అబ్బూరివారి 'కాపుపాట' కూ పై కృష్ణశాస్త్రి గారి గీతానికీ పోలికలున్నాయి.

"పాడుట కొప్పవేని, పడపల్లడిపించెడు నేటి త్రోవలే
చూడగవద్దు, లేతమనసులో తడిసేసెడు చెట్లచాటునన్
గూడిన మేనులాసు కొనకొమ్మల నాకులవోల, నొక్కమా
టాడక కూరుచుంద మనువైన పొలమ్ముల గట్టు నీడలన్" అనేఅబ్బూరివారి

'కాపుపాట' దృశ్యం సంధ్యాసమయం, పొలంలో ప్రేయసీ ప్రియులు కలుసుకున్నారు. లేతమనసులు తడిచేసే చెట్లచాటున కలుసుకోగోరుతున్నాడు ప్రియుడు. నిశ్శబ్దాన్ని కోరుకుంటున్నాడు. తనువైన పొలాల గట్లనీడలలో, కూడిన మేనులానుకొనేటట్లుగా కొమ్మలమీద ఆకులాగ కూర్చుందామంటున్నాడు.

కృష్ణశాస్త్రి గారి యీ ఖండకావ్యం 'అతని పాట'లో కూడ సమయం సంధ్యా సమయమే చోటు పొలము గట్టే, ఏకాంతమైన చోటే - చల్లగాలిలో ఒకరిచేతిలో ఒకరు చేతులుంచుకొని, మనులేత చిత్తములు ఐక్యమొందగా "ఈపునేనె పిట్టలటుల నేమియనక ; సర్వమును జీర యపూర్వభావముదయమయ్యె" నని ప్రేయసి పలుకు తున్నది. 'కాపు పాటలోవేని ఒక రమణీయమైన దృశ్యాన్ని కృష్ణశాస్త్రి కల్పించారు. అలతి అలతి పాటలతో దృశ్యాన్ని ఊహించుకొనే బాధ్యతను సహృదయులకే విడిచి పెట్టారు. "మొగముగంటి; మొగిలుగంటి; మొగిలుగంటి; పాటవినుచుంటి" ననే ప్రియురాలు తలంపు సహృదయులకు ఆలోచామృతమై చవులూరిస్తాయి.

మాలిసన్నలు, మధుమాసకవేళలు, చుక్కలరాత్రులు, మలయనిలాలు కృష్ణశాస్త్రి ప్రణయకవితలోనూ కవ్విస్తాయి. కాని ఊహలలో నవ్యత, చున్నితత్వం కృష్ణశాస్త్రిని భావకవులలో అగ్రేసరునిగా నిలుపుతాయి.

## 8

"హృదయ వనజాత మృదుమనోహర దళము
లదయతను ద్రుంచినారే పెంధూళిఁ జిదిమి వెదజల్లినారే!
హృదయశోణితధార నెదుగు జీవితవల్లి
మొదలంటఁ దూల్చినారే భయదాగ్నికీలలను వ్రేల్చినారే."

భావకవిత్వ మంతటిలోను విలక్షణమైన గీతం పేర్కొనవచ్చు. భావకవిత్వమన గానే సౌందర్యం, ప్రేమ ముఖ్యంగా విశ్వమానవ ప్రేమ తలపుకు వస్తాయి. భావ కవిత్వంలో ప్రకృతి, ప్రణయం, ప్రబోధం ప్రముఖంగా కనిపిస్తాయి. ఆత్మాశ్రయరీతికి భావకవిత్వంలో ప్రాధాన్యం ఉంటుంది.

భావంలేని కవిత్వముంటుందా? అని ప్రశ్నించి భావకవిత్వాన్ని అవహేళనచేసిన వారికి జవాబుగా చూపదగిన "అబ్బ"అనే యీ గీతం.

భావకవిత్వ స్వరూప స్వభావాలను గమనించిన విశ్వనాథ, శ్రీశ్రీగారలు చెరొక విధంగా దాన్ని నిర్వచించారు. "కవియొక్క ఒక అవిస్పష్ట వాంఛాంకురము. ఒక అంతస్సిగూఢతాపము, ఒక చిన్న కావ్యములో ఉంచబడినచో అది భావకవిత్వ"మని

విశ్వనాథ పేర్కొన్నారు. ఈ నిర్వచనానికి సరిగా సరిపోయేగీతం "అబ్బ!" కవి అంతర్నిగూఢ తాపము యీ గీతంలో నులివెచ్చగా వెలువడింది.

'ప్రేమనిచ్చిన ప్రేమవచ్చును' అంటారేగాని ప్రేమకు ప్రతిఫలంగా కాఠిన్యం ఎదురైనప్పటి దుస్థితిని కృష్ణశాస్త్రి ఈ గీతంలో వర్ణిస్తున్నారు. హృదయపద్మపుమృదు మనోహర దళములను జాలిలేక తుంచి, పెంధూళిలో కలిపి, చిదిమి వెదజల్లినపుడు బాధతో పలికినమాట 'అబ్బ!' హృదయంలోని ప్రేమను శోణితధారపోసి పెంచుకొన్న జీవితవల్లిని క్రూరులైన లోకులు మొదలంట దూల్చినారే! భయంకరమైన అగ్నిజ్వాలలో వ్రేల్చినారని కవి బాధతో గుండెలు మూర్ఛిల్లగా 'అబ్బ అనుకుంటున్నారు.

"హృదయాలను మానసాలను కలవరపరుస్తూ, అల్లకల్లోలంగా ఘూర్ణిల్లేసంచారా ప్రాంతారాలలో కలికి నిరాఘాటంగా విహరించే అధికారం కలదు. అట్టి అతనిసంచారా లలో ఏ సన్ముహూర్తాననో కావ్యగీతం ఒకటి మెరుగులుతీరిన విలక్షణ రచనా ధోరణిలో వెలుగుచూస్తుంది. ఆ గీతం కవి అనుభవించిన రసస్థాయిని సమగ్రంగా పాఠకునిలో ఆవిష్కరించ గలుగుతుంది. ఉత్కృష్టభావగీతానికి నా నిర్వచనం ఇది. కృష్ణశాస్త్రి హృదయాన్ని కలవరపరచి, అల్లకల్లోలంచేసి తన బాధనంతా ప్రపంచపు బాధగా సాధారణీకరించిన భావం యీ గీతంలో ఉన్నది.

1923-24 ప్రాంతాలలో సాహిత్యయాత్రలో "బందరులో "అబ్బ!" అన్న నా ఖండకావ్యాన్ని విశ్వనాథ బాగా మెచ్చుకొన్నాడు" అని కృష్ణశాస్త్రిగారే స్వయంగా "పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము" వ్యాసంలో తెలిపారు.

స్వేచ్ఛను హరించే లోకాన్ని కృష్ణశాస్త్రి ద్వేషించారు.

"పక్షినని పాడగలనని ప్రణయవీధి
నిత్య లీలా విహారముల్ నెఱపుదునని
పక్షములఁదూల్చి బంధించి పంబరాన
గానమును ప్రాణము హరింపఁబూనినారు" అని హోతాశువై పలికారు. పక్షి వలె నాకాశనిర్మలపథవిహార స్వేచ్ఛగోరితి, పక్షములు వేవంచెఱుంగక ప్రాకు లాడుచుఁబొగిలితిన్" అని తన అశక్తతను ఆయన మరొకచోట గూడి తెలిపారు.

"మ్రొక్కిన కొలంది కాలితోఁద్రొక్కు యీ లోకనైజమేమందుమోర !" అనే వేదులవారి తలపు కృష్ణశాస్త్రిగారి గీతాన్ని పోలినది.

తన హృదయపద్మ దళాలను తుంచివేసిన తన జీవితవల్లిని అగ్నికీలల్లో కాల్చిన లోకాన్ని "ఏటిపని యిది లోకమా ! హృదయదళన
దారుణ మహోగ్ర కార్యంబుఁదలచినావు;

ప్రణయ మధురిమ మెఱుఁగవు, పాపమనపు
పక్షముల దూల్తు, బంధింతు పంజరాన
వెఱ్ఱిలోకము ! హృదయంపు స్వేచ్ఛ నెటులు
పంజరకబుస బంధింతె ?" అని ధిక్కరించి పలుకుతారు. పంజరం తలుపులు విరగగొట్టి ఆయన స్వేచ్ఛాజీవిగా సంచరించారు.

## 9

"కన్నీటి కెరటాల వెన్నెలేలా ?
నిట్టూర్పు గాడ్పులో నెత్తావి యేలా ?
ప్రళయకాల మహోగ్ర భయదజీమూతోరు
గళ ఘోర గంభీర పెళపెళార్భటులలో
మెఱపేలా ?

భావకవులకు దుఃఖం ప్రియతమమైన కావ్య వస్తువు. ఈ స్థితి కృష్ణశాస్త్రిగారితోనే ప్రారంభమైనదని చెప్పవచ్చు. దుఃఖానికి దుఃఖానికి నడుమ ఏదో సుఖలేశం మనిషిని చావకుండ బతికిస్తుంది. నల్లని మబ్బుకు వెండి జరీ అంచున్నట్లు పుట్టెడుదుఃఖంలో ఏదో ఒక సుఖలేశం వుంటుంది. కమ్ముకున్న నిరాశకు చివర ఆశ ఏదో కన్పించి బతుకంతా నానికోసం నిరీక్షించేటట్లు చేస్తుంది. ఇది సృష్టి వైచిత్రి-భగవంతుని లీల ఈ భావాన్ని కృష్ణశాస్త్రి 'ఆశ' గీతంలో మనోజ్ఞంగా వర్ణించారు.

కన్నీటి కెరటాలలో వెన్నెలెందుకు? నిట్టూర్పుగాడ్పులో నెత్తావి ఎందుకు? ప్రళయకాలంలో మహోగ్రంగా గర్జించే మేఘాల గర్జనలలో, గంభీర పెళ పెళార్భటులలో మెరపెందుకు ? పిడుగుపాటులో నీరెందుకు ? హాలాహలంలో అమృతమెందుకు ? గాఢంగా అలముకొన్న హేమంతపు రాత్రి కుంతలములలో ఒకే ఒక చుక్క ఎందుకు? శిథిలమైన శిశిరంలో చివురెందుకు ? పాషాణ పాళిపైన ప్రసవమెందుకు? వికృతమైన క్రూరమైన క్షుధాక్షుభిత మృత్యుకఠోర పాండుర శుష్కవదన దంష్ట్రాగ్నిలోనవ్వెందుకు? అని ప్రశ్నలమీద ప్రశ్నలు వెలయించి అంతులేని నిరాశలో ఆశకు చోటుండటాన్ని చూచి ఆశ్చర్యపోయారు.

ఈగీతంలో కవి ప్రయోగించిన సుదీర్ఘ సమాసాలు,ఆక్షేపణలకు గురిఅయ్యాయి. కవి హృదయంలో తీవలు సాగిన తీవ్రత దానికి తగిన శబ్ద జాలాన్ని వెదుక్కొని వచ్చి నట్లనిపిస్తుందేగాని అన్వయ క్లేశాన్ని కలిగించదు.

కన్నీటి కెరటాలలో వెన్నెలను, నిట్టూర్పుగాడ్పులో నెత్తావిని ఊహించి కృష్ణశాస్త్రి వేదనకు గౌరవస్థానాన్ని కల్పించారు. ఆయన భావ వ్యక్తీకరణలోదుఃఖం రసజ్ఞుల హృదయాన్ని చీల్చుకుపోతుంది.

సతీ వియోగం కృష్ణశాస్త్రిచే పెక్కు ఖండ కావ్యాలను పలికించింది. కురిసే వానను చూచి "ఎంత బరువయ్యెనోగాని యెడదవెలికి/దొలఁగి పాఱని దుఃఖాశ్రుజాలము వలనఁ / ప్రావృడంభోధరస్వామి! నీవుకూడ / నావలనె జాలిఒడమ వాపోవుచుంటివి" అన్నారు. జీవనభారం తొలగిపోయేటట్లు ఎవరికైన తన సొదను చెప్పుకొన్నట్లు వాన ఒక్కొక్కసారి గొణుగుకుంటూ కురుస్తున్నదని తలచారు. మబ్బు తనగుండె బరువును వాన కన్నీళ్ళతో తీర్చుకున్నాక జిగులు వలిపెపు వన్నె చీరెల ధరించి, కులుకు నవ్వుల పవడాల తలుకులో ఆట పాటలలో పొద్దుపుచ్చుతుంది. తాను మాత్రం ఎడతెగని యాత్ర సాగింపలేక ఒక్కడినే కృశిస్తానని వాపోయారు. ఏడ్చి ఏడ్చి హృదయ సుమము శయ్యాతలాన విశ్రాంతి తీసుకోబోతే, చీకటి ముసుగున ఒత్తిగిలద్రోసి దుఃఖం అక్కడికి కూడ వచ్చి వేధిస్తున్నదన్నారు. రాత్రంతా కళ్ళుతెరచి తను దుఃఖమే తనకు తోడుగా గడుపుతానన్నారు.

## 10

"ఏను మీ వలెనె కంఠ మెత్తి పాడ
నెంతో యుబలాట పడి సవరింతు గొంతు
ఏను మీ వలెనే నవానూన గాన
విస్తృత వ్యోమయానాల వెడలి వెడలి
భావ లోకాంచలమ్ముల వాల దలతు
ఐన నేమాయె' ఆపు కోలేని పాట
యెఁదదరొద సేయునో లేదో యింకి పోవు
నంతలోననే కట కటా'యంతు లేని
దారిలేని శోతంపు టెడారులందు"

భావ కవిత్వంలో ఆత్మాశ్రయమైన ధోరణి ప్రబలినతర్వాత "నేను" అని కవులు ఉత్తమ పురుషలో తమ భావాలను వెల్లడించ సాగారు.

కవి కూడ అందరిలాగే కంఠమెత్తి పాట పాడడానికి ఉబలాట పడి గొంతు సవరించు కోగా ఆయనకంఠంలో నుండి బయల్వెడిన రొద అంతులేని, దారి లేని శోకపుటెడారులలో ఇందపోయి సవ్వడి బయటకు రాదన్నారు. అందరిలాగే ఊహా లోకాలలో విహరిలచి కొత్త లోకాలు చేరుకోవాలను కున్నారు. పాడలేని తాను లజ్జా విషాద భారంచేత లోతెరుగని పాతాలలోకాలకు కుంగి పోతానన్నారు.

"మూగ వోయిన నాగళమ్మనను కూడ
నిదుర వోయిన సెలయేటి రోదలు కలవు" అని కృష్ణ పక్షంలో తేల్పటం ఎంత విచిత్రం! తర్వాత చులా సంవత్సరాలకు ఆయన గొంతుకు "కేన్సర్" వ్యాధి సోకి

"ఆపరేషన్" చేసి స్వరపేటిక తొలగించిన తర్వాత నిజంగానే ఆయన గొంతు మూగ పోయింది. రాబోయేస్థితి కృష్ణశాస్త్రిగారికి ముందే తెలిసిందా ? అనిపించే విషాద గాంభీర్యం యీ గీతంలో ఉన్నది. గొంతు మూగబోయినా ఆయన హృదయం కవిత్వాన్ని ఆలపించటం మానలేదు. మూగబోయిన నాగళంలో నిద్రబోయిన సెలయేటి రొదలు కలవని చెప్పినట్లే గొంతు మూగబోయాకా ఆయన రసవంతమైన కవితలెన్నో రచించారు. తన అనారోగ్యాన్ని, అసౌకర్యాన్ని కవిత్వ వస్తువుగా మార్చుకొని, ఇతోధికమైన పేరణతో జీవించినన్నాళ్లూ రచన చేశారు.

## 11

"ఎవ్వరని యెంతురోనన్ను ? ఏననంత
శోకభీకర తిమిరలోకైకపతిని!
నాకు నిశ్వాస తాళవృంతాలు కలవు
నాకుఁ గన్నీటి సరుల దొంతరలు కలవు
నా కమూల్య మపూర్వ మానంద మొసఁగు
నిరుపమ నితాంత దుఃఖంపు నిధులుకలవు-
ఎవ్వరని యేంతురో నన్ను ? -"

శోకగీతాల రచనలో భావకవులకు ఎరవడి దిద్దినది కృష్ణశాస్త్రి గారేననటం అతిశయోక్తికాదు. భార్యా వియోగంతో దుఃఖితమతియైన శాస్త్రిగారు శోకగీతాలు రచించారు. మనస్సుకు దుఃఖంతో నిరంతరసాహచర్యం ఏర్పడటంలో దుఃఖమే ఆయనకు వింతశోకంగా పరిణమించింది, అంతులేని సంపదగా తోచింది. ఆత్మశక్తి నుజ్జీవింప జేసింది. లోకం తృణప్రాయంగా తోచింది.

"నేను శోకం చేత భయంకరమైన చీకటిలోకానికి అధిపతిని నన్ను చూచిఎవ్వరూ జాలి చెందవద్దు. నేను కంటక కిరీటాన్ని ధరించి. కాళరాత్రిమధ్యవేళల్లో నల్లని మబ్బుల గుంపుతో ఏకాంత గోష్టిసలిపి, దారుణమైన గుడ్లగూబల ఏడుపులు వింటాను. నా ఏడుపుకు గుడ్లగూబలు శ్రుతికలపటంతో చీకటిరాత్రి ఉప్పొంగిపోయి, వెఱ్ఱెత్తి భీకర కరాళ రూపం ధరిస్తుంది.

నన్ను చూచి ఎవ్వరూ జాలిపడవద్దు. నాకేకొరతాలేదు. నాకు తాటిచెట్లవలె పొడవైన నిట్టూర్పులున్నాయి కన్నీటిధారలనే ముత్యాలసరులున్నాయి. నాకు అమూల్యము, అపూర్వము అయిన ఆనందాన్ని యిచ్చే నిరుపమ నితాంతదుఃఖపునిధులున్నాయి నాకేమి కొరత, నన్నెవ్వరని తలుస్తున్నారు? నేను అనంత శోకభీకర తిమిర లోకైకపతిని" — దుఃఖించి దుఃఖించి మనస్సు తేలికైంది. మరొక ప్రాణికై

దుఃఖించటంలో ఆత్మశక్తి మేలుకొన్నది. శోకాన్ని కరుణ రసంగా మార్చుకొనిఆయన రసవ్యత్యాసాలను ప్రసాదించారు.

శోకించి, శోకంలో ఆనందాన్ని పొందుతున్న తనను లోకం అడ్డుకుంటున్నదని కవి తలంచారు. "మీరు మన సారగా నేడ్వనీరు నన్ను.

నన్ను విడుపుడు! ఒకసారి నన్ను విడిచి
నంత నేకాంత యవని కాభ్యంతరమున
వెక్కివెక్కి రోదింతును" అని లోకాన్ని వేడు

కున్నారు. కన్నీటి కంటె హృదయ భారాన్ని తొలగించే శక్తి మరేముంది? వేధించే శోకాన్ని కన్నీటితోక్షాళనం చేసుకొని, ఆ కన్నీటి బిందువులను భగవంతునికి ముత్యాల పరంగా సమర్పించుకోమంటారు-

"కురియుమురా కన్నీటిని!
మఱిమఱి విలపింపుమురా!
సరము గూర్చి పరమేశుడె
దాల్చునురా పాపీ" అని పరులకోసం కన్నీరు విడువగలిగిన వారిని కవి ధన్యజీవులుగా తలచారు.

భార్య మరణించినప్పుడు కలిగిన దుఃఖంలో ఆమెతోపాటుగా శాస్త్రిగారు తానూ మరణించాలనుకోలేదు. పైగా "నాకు మరణమ్ము వలదనినాను" అన్నారు. అసువులు తొలగిపోతే ఆమెకోసం దుఃఖించటానికి వీలుకాదనే తలపుతో తనకు మరణం వద్దంటున్నారు. మరణించి దుఃఖం నుండి తప్పించుకోవడం కంటె జీవించి" తుది మొదలుకొని కానరానిది; మహాంధకార కలుషిత కృష్ణపక్షంపు వీధిగరము గరమునగీలించి కలసి మెలసి మన్నసహధర్మచారిణి, మధుర మధురమూర్తి ప్రియురాలు, సఖురాలు, పూర్ణరాగకలితయైన తన అర్థాంగి కోసం దుఃఖించటమే తన కిష్టమని పలికారు.

ఉదాత్తమూ, ఉజ్వలమూ ఆయనభావనద్వారా కృష్ణశాస్త్రి తన సతీమణిని సాహిత్యసీమలో ఒక తేజోవంతమైన తారకగా నిలిపారు.

## 12

"నానివాసమ్ము తొలుత గంధర్వలోక
మధుర సుషిమా సుధాగాన మంజువాటి
ఏనో కవియోగ గీతిక
ఇది ముగియబోని ఏయర్థమెఱుగరాని

వేసటేలేని వెఱ్ఱి యన్వేషణమ్ము !
ఈ ప్రవాస యాత్రారతి నిటులెనేను
కదలి పోవుదు నాశవకాశములను
ఒక్క నిట్టూర్పు పోనిక, ఒక్క మౌన
బాష్పకణమటు, ఒక గాఢవాంఛ పగిది"

ప్రియురాలు మరణించగా శోకించి తపించిన తర్వాత కృష్ణశాస్త్రిగారిలో పూర్వజన్మస్మృతి తలెత్తింది. తానొక గంధర్వునిగా ఆయన భావించుకొన్నారు. పూర్వజన్మలోని ప్రేయసికోసం తానింకా అన్వేషిస్తున్నట్లు తోచింది.

ప్రేయసి మరణంతో తనకు దిక్కుతోచలేదు - "వారులన్నియుమాపె దశదిశలు ముంచెత్తె; నీ రంధ్ర భయదాంధ కార జేమూతాళి" అని అప్పటిమన స్థితిని వర్ణించారు. వియోగబాధ భరించలేక ఎలుగెత్తి ఆక్రోశిస్తే "తారలే కనువిచ్చి తమములే శ్రుతివిచ్చి, ఆ వరము విని" ఆయనను చూచి జాలిపడ్డాయి. ప్రేయసితోడిదే యిక తనలోకమనుకున్నాడు.

"సిరిలేని నడిరేయిఁబడిపోయినట్టి నీ
కడియాల రవళులే చిరుగాజు మ్రోతలే
వేలెత్తి చూపు జీవితపథమ్ములు నాకు
వేలెత్తి నడిపించు నెల్గెత్తి నన్బిలుచు" అని ఆమె పోయినమార్గంలోనే నడవాలనుకున్నారు.

ఆయన శోకాన్ని చూడలేక తారకలు కన్నులు అట్టె ఆర్చుకున్నాయి. మబ్బులు నిట్టూర్పు దొంతరలు విడిచాయి; గాలి రిచ్చపడి పట్టి పసిపాపలాగ మౌనం వహించింది. ఇంకా బిగ్గరగా ఏడవాలనుకుంటే "స్థాణువయ్యేనో, పాషాణ జడభరమ్ము గనెనో"ఆయన కంఠరవం కదలదు మెదలదు." వనరు చేద్వగలేను, చచ్చిచావగలేను కనలేని వెలుఁగు కొఱకై ఎన్నడును కనరాని దానికొఱకై" అని పగచి "ఒకఁడనే శూన్యమున పడి వోదును. ఒకడనే కృశియింతు"నని నైరాశ్యంలో మునిగిపోయారు.

అనంతమైన ఆ విషాదం కవి మనస్సును అన్నిదిక్కుల నుండి చీకటితో "నాకు గాదులు లేవు నా కుషస్సులులేవు నేను హేమంత కృష్ణానంత కృష్ణానంత శర్మ రిని నాకు కాలమ్మొక్కటే గారురూపు నా శోకమ్ము వలెనె, నా బ్రతుకువలె నావలెనె" అని తలచేటట్లుచేసింది. ఆ చీకటి కవికి ప్రేయసిగా తోచింది. "ప్రేయసీ! ఓ యమావాస్యా తపస్వినీ!" అని సంబోధించి కోటి నవమల్లికలు, కోటికన్నులు విచ్చి, విరహవీక్షణ భయంకరమాధురులలో తనను పలకరిస్తే బ్రతుకు వేగిపోతుందనీ, ఆగలేననీ ఆక్రోశించారు.

పూర్వజన్మస్మృతి కలకవేయగా "నా నివాసమ్ము తొలుత గంధర్వలోక మధురసుషిమా సుధాగాన మంజువాటి. ఏనొక వియోగగీతిక"నని పలికారు. తిరిగిరాని ప్రేయసికోసం వెదకటం వెఱ్ఱి అని కవికి తెలుసు. అందుకే ఇది ముగియబోని ఏయర్థమో ఎఱుగరాని, వేసటేలేని వెఱ్ఱి అన్వేషణమన్నారు కాని ఆ అన్వేషణము కొనసాగించ దలచారు. "ఈ ప్రవాస యాత్రారీతి నిటులె నేను

కదలిపోవుదు నాశావకాశములను

ప్రేయసి స్మృతులె తనకు కావాలంటారు.

"వలపుటాకలి స్రుక్కు నా బ్రతుకుమీఁద

ఇనుప పాదాలనిడి లోకమిపుడు నడచు"నని చెప్పి తనను జీవితేచ్ఛ నశించిన దన్నారు.

"ఏను మరణించుచున్నాను; ఇటు నశించు

నా కొఱకు చెమ్మగిల నయనమ్ము లేదు

నా మరణశయ్య పఱచుకొన్నాను నేనె!

నేనె నాకు వీడ్కొలుపు విన్పించినాను" అని పలికి తనను "బ్రతికియున్న మృత్యువు"గా వర్ణించుకున్నారు

ఈ దుస్థితిలో ఈ నిశీథిలో నీడలాగ నిలిచి ఎవరో మూగకనులు మోయలేని చూపులతో తనను పలకరించినట్లనిపించింది. "ఇపుడా నను బలుకరింతురు! - పెను చీఁకటి సైగలతో నా కన్నుల లక్ష్మురలలాగి కొందురేల? నా హృదయ నాళముమ తునియలుగా" చేయుటేల?" అని కవి దీనంగా పలికారు. "ఇపుడా నను బలుకరింతురు" అనే కవి దీనాలాపం గుండెలు కలుక్కుమనేటట్లు చేస్తుంది. "కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ" అని చలంగారన్న మాటవు 'కృష్ణపక్షము; ప్రవాసము' కావ్యాలకు బాగా వర్తిస్తాయి. ప్రేమకోసం జీవితాన్ని అంతం చేసుకున్న మొక్కపాటి రామమూర్తికి కృష్ణశాస్త్రి 'ప్రవాసము' కావ్యాన్ని అంకిత మివ్వటం సముచితమైనపని చలం. ముద్దుకృష్ణగారలు కూడ తమ రచనలను రామమూర్తికి అంకితం చేశారు.

## 13

"నీవు తొలిప్రొద్దు నునుమంచు తీవసౌనవు

నీవు వర్షాశరత్తుల నిబిడి సంగ

మమునఁబొడమిన సంధ్యాకుమారి నీవు

తిమిర నిశ్వాసముల మాసి కుములు శర్వ

రీ వియోగ కపోలపాళికవు నీవె
నీవె నిట్టూర్పు, నీవె కన్నీరు, విశ్వ
వేదనామూల్య భాగ్యమీవే నిజమ్ము—"

విశ్వప్రేయసి ఊర్వశిగురించి కృష్ణశాస్త్రిగారి భావన ఇది. కృష్ణపక్షంలో ప్రవాసియై తిరిగితిరిగి, కంటబడిన ప్రతి లావణ్యాన్నీ కదిపి కదిపీ ప్రక్కనమోగిన ప్రతి హృదయాన్నీ పలకరించి పలకరించీ, లోకంలో తనకువచ్చిన సౌందర్యంలేదనీ, తనను ప్రేమించి తాను ప్రేమించే ప్రేయసి లేదని కుంగిపోయి...శాంత చిత్తుడై తానే ప్రేయసిని సృష్టించుకున్నాడు." తన మనస్సును ఎన్నడో సోకిన సౌందర్యఖండాన్ని, తన హృదయాన్ని ఎన్నడో పలికించిన ప్రేమశకలాన్ని కలిపి కృష్ణశాస్త్రిగారు ఊర్వశిని సృష్టించుకున్నారు.

ఊర్వశిని భారతీయ కవులు పలువిధాలుగా వర్ణించారు. క్షీరసాగర గర్భంలోంచి ఒక చేతిలో విషభాండంతో, మరొక చేతిలో సుధాపాత్రతో ఊర్వశి అవతరించినట్లు పురాణాలు తెలిపాయి. బదరికాశ్రమంలో తపస్సుచేస్తున్న నారాయణముని తపస్సును కలత పెట్టటానికి ఇంద్రుడు రంభాద్యప్సరసలను పంపాడు. నారాయణుడు చిరునవ్వు నవ్వి, తొడలొంచి (ఊరువులోంచి) ఏదోతీసి అప్సరసల కెదురుగా విసిరాడు. అది ఊర్వశీరూపం ధరించిందని మరికొన్ని పురాణాలు చెప్తాయి. కాళిదాసు ఊర్వశీఅర్జునుల ప్రణయగాథను "విక్రమోర్వశీయ"నాటకంగా రచించాడు. పురాణంలో ఊర్వశీ పురూరవుల ప్రణయాన్ని తెలిపే మరొక గాథ ఉన్నది.

ఊర్వశిపై విశ్వకవి రవీంద్రుడొక కావ్యం రచించాడు. అందులో ఊర్వశిని "నహోమాతా, నహోకన్యా, నహోవధూ" అన్నాడు, "అనంత యౌవనా!" అనిరవీంద్రుడు ఊర్వశిని ప్రేమతో సంబోధించాడు.

తొలిపొద్దున కురిసే నునుమంచు తీవసోనగా, వర్షా, శరదృతువులకలయికలో పొడమిన సంధ్యాకుమారిగా, చీకట్ల నిశ్వాసాలతో మాసి కుమిలిపోయే రాత్రి వియోగ కపోలపాళికగా, కన్నీరుగా విశ్వవేదనా మూల్యంగా కృష్ణశాస్త్రి ఊర్వశిని వర్ణించారు. ఊర్వశిని యుగయుగాల నేత్రాల అశ్రువర్షాలు కడుగగా చల్లగా జాలిజాలిగా శాంత మధురముగ నుషఃకాల కౌముదసొగసుగా ఆయన భావించారు.

విషంతో, అమృతంతో, చీకటితో, వెన్నెలతో కలిసిన స్త్రీగా ఊర్వశిని గురించి ఆయన ఊహించారు. ఊర్వశి స్త్రీ, ఊర్వశి దేవి! ఊర్వశి మోహినీహాసమల్లి! వైజయంతీ పరిమళము! హరజటాపారిజాతము అని పరిపరివిధాల ఆమె సౌందర్యాన్ని ప్రశంసించారు.

"నేటి తెలుగుకవికి ఊర్వశి అంటే లోపంలేని ఆనందం. కలతలేని శాంతి అమృతం! ఊర్వశిని ప్రేమిస్తే లోకంలో ఎవరినీ ప్రేమించలేకుండా ఉండలేమంటాడు నేటి తెలుగుకవి కనుక ఊర్వశికోసమే లోకంలో మంటా, వేదనా, బాధా, ఈర్ష్యా, ద్వేషమూ, ఏడుపూ ఉంచలేనంటాడు నేటి తెలుగు కవి" ("ఊర్వశి" కృష్ణశాస్త్రిగారి మొదటి రేడియో ప్రసంగం—మద్రాసు కేంద్రం-వ్యాసావళి 2)

## 14

"ఆమె కన్నులలో ననంతాంబరంపు
నీలి నీడలు కలవు
వినిర్మలాంబు

పూరగంభీర శాంత కాసార చిత్ర
హృదయములలోని గాటంపు నిదురచాయ
లందు నెడనెడఁ గ్రమ్ము."

ఊర్వశిని సౌందర్యాధిదేవతగా కృష్ణశాస్త్రి భావించారు. ఆమె కన్నులలో అనంతమైన ఆకాశపు నీలినీడలు కలవనీ, ఆ కన్నులలో నిర్మలమైన, పూర్ణమైన గంభీరమైన, ప్రశాంతమైన కొలనుల చిత్త హృదయాలలోని గాఢమైన నిద్రఛాయలు కమ్ముకొంటాయన్నారు

ఆమె కళ్ళను భావగీతాలతో పోల్చారు. "ఏదియో అపూర్వమధుర రక్తి స్ఫురియించుఁగాని, అర్థమ్ముకాని భావగీతమ్ములవి." ఈ పోలిక మొత్తం భావ కవిత్వాని కంతటికీ వర్తింపజేయవచ్చు.

ఊర్వశి లోకదేవతగా కృష్ణశాస్త్రిగారు ఊహించారు.

"నీయాజ్ఞ కూడెనా, గొంతుముడివీడెనా
హాయిగా యుగయుగంబుల కలలోపాడనా
చిరగాఢ నిద్రమేల్కొలిపి సందేశాలఁ

బరపనా దిక్కుదిక్కులకు చుక్కలను" అని ఆమె కటాక్షంకోసం వేడుకున్నారు.

ఆమె ప్రాయపు వాకిళ్ళలో సిగ్గుదొంతరుల తెరలలో తన వలపు తడబడి అణగి పోతుందన్నారు.

ఊర్వశి కవిని కటాక్షించింది" కాలమే పసిపాప కనువిచ్చిన యషస్సు
కలగా కలవరించి వెలుఁగుగా పులకించి
ఇరుల కడుపొరసినే తెఱచి వాలిన నాఁడె
మిసిమి పన్నెలమేన మసి జాలిగానయ్యే...

తొలి వియోగిని నేనె !
తొలి ప్రేయసిని నేనె !
ఆనాటికీ నాఁటి నేను నీదాననే" నని

నమ్మకంగా పలికింది.

ఊర్వశి ప్రేమను పొందిన కృష్ణశాస్త్రి ప్రణయ పారవశ్యాన్ని పెక్కు విధాలుగ తెలిపారు.

"నాకు మాత్రము గానమున్నంత వఱకు
చాలుచాలు నీ ప్రణయ నిశ్వాసమొకటె
మోసికొందునో నా గీతములను నిన్ను
మూగవోదునో రాయియైపోయి చిరము
నా హృదయమందు విశ్వవీణా గళమ్ము
భోరుభోరున నీవాఁడు మ్రోఁత తెల్పు;
దశదశా తంత్రులొక్క సుధాశ్రుతిని బె
నంగి చుక్కలమెట్లపై వంగి వంగి
నిలిచి నిలిచి నృత్యోత్సవమ్ముల చలించు"

కలచు నాలోన క్షీరసాగరము నేడు
మోయలేనింక లోకాల తీయఁదనము

ఆలపింతు నానంద తేజోంబు నిధుల" అని ఆయన తన ఆనందాన్ని వెల్లడించారు. ఊర్వశిని పూజించటానికి పూలకోసం వెతకనక్కరలేదు. "నింగి మూలల నీలి పందిళ్ళు పఱచి తెలిమల్లెతోట వేయించి" ఆమె యేపూలను సిద్ధం చేసింది.

ఊర్వశి ఆనుపానులన్నీ కృష్ణశాస్త్రిగారికి తెలుసు. "ఊర్వశీ సుధర్మాస్థానంలో నీవే మూల నిలుచుంటావో నాకు తెలుసు, నందనారామంలో నీ పారిజాతచ్ఛాయ నాకు తెలుసు ! నీఇల్లు వెనకాలే ఒరుసుకుని మందాకిని పరుగెత్తుతుందని నాకు తెలుసు.... ఊర్వశీ ! అది నీ చరణ శోణితమా ? పారాణా ? నా హృదయ రక్తమా ? ఊర్వశీ ! నా కావ్యానివి నీవు నక్షత్రాలలో ! నేను ఈ లోకాన్ని స్వర్గలోకం చేస్తాను. నువ్వు

పక్కనుండు నేను లోకాన్ని వైకుంఠం చేస్తాను" అన్నారాయన. ఈ లోకాన్ని స్వర్గ లోకం చేయకపోయినా ఊర్వశీ సౌందర్యప్రశంసతో తెలుగుకవితకు అత్యంత సౌంద ర్యాన్ని సమకూర్చారు.

"అవధరింతువు ప్రతి దివసాంతమందు
నిత్యనూతన తాండవ నృత్యకేళి
ఓయి నటరాజ తలలైన నూపలేక
భువనములు దుర్భరానందమున నడంగ"

కృష్ణశాస్త్రిగారి కవితాస్రవంతిలో ఈశ్వరారాధనమైన మొక విశేషమైన భాగం ప్రకృతిలో గల అన్ని వస్తువులలోను ఆయన ఈశ్వరుణ్ణి సందర్శించారు. వైష్ణవ గీతా లలో మాధుర్యాన్ని పుణికి పుచ్చుకున్నారు. బ్రాహ్మసమాజంలోని విశాలమానవ దృష్టి, సంకల్పశక్తీ ఆయనకు బలాన్ని చేకూర్చాయి. గేయ రచనలో శబ్దమూ అర్థమూ వాటికి తగిన లయా కృష్ణశాస్త్రి కవిత్వంలో కుదిరినట్లు మరే తెలుగు కవిలోను కుదిరి నట్లనిపించవు.

శ్రీకృష్ణభక్తి ఆయన కవిత్వంలో అంతర్వాహినిగా ఉన్నది. తానే ఒక గోపికగా భావించుకొని భగవంతుని తన హృదయంలోకి తీసుకోవాలనే ఆరాటం; అందుకోసం అన్వేషణా ఆయన కవిత్వంలో కానవస్తాయి. భగవంతుణ్ణి సమస్త ప్రకృతిలోను దర్శించగలిగిన ఆయనకు కృష్ణుడు, రాముడు, శివుడు, అల్లా, జీసస్ అందరూ వొకటే విశాల మానవదృక్పథానికి ఆయన గీతాలలో ఉన్న పేర్లు అడ్డురావు శివుణ్ణి వర్ణిస్తున్నపుడు శివభక్తుడిలాగ, కృష్ణుణ్ణి ప్రార్థిస్తున్నపుడు కృష్ణ భక్తుడిలాగ కన్పించినా ఆయన మాత్రం తుదిదాకా ఏకేశ్వరోపాసకులే.

కృష్ణశాస్త్రిగారి భక్తిగీతాలు "మహతి, అమృతవీణ" మొదలైన సంపూటాలలో ఉన్నాయి.

ప్రతిదినమూ సాయంసంధ్యలో నిత్యనూతన తాండవకేళిలో తేలియాడే నటరాజ లోకాలన్నిటినీ అంతులేని ఆనందంలో ముంచెత్తుతున్నాడు లోకాలు నటరాజ తాండవ కేళికి అనుగుణంగా తలలైన ఊపలేక ఆనందంలో మునిగిపోతున్నాయి. దేవునిలాగే కవికూడ తన లజ్జను విడనాడి, నాట్యమాడబోతే దాహం ఆయనను దహించి వేస్తున్నది, అప్పుడు కవి నటరాజుకు కైమోడ్పు ఘటించి.

"ఆటతో పాటతో నేర్చినట్లు దేవ
ఏను కూడ నీవలె నటియింపనిమ్ము

ఎడతెగని యాత్రనెట్లా సాగించుపఅకుఁ
ఎట్లా నీదర్శనమ్ము సాధించుపఅకు !" అని వేడుకున్నారు :

కవి భగవంతుణ్ణి తనతో పోల్చుకున్నాడు.

"నా వలెనె యాత్రఁడున్మత్త భావశాలి
ఆగికోలేడు రేగునూహల నొకింత...
ఇంత చిఱుగీతి యెదవేగిరించు నేని
పాడుకొనును తాండవ నృత్యమాడు కొనును
ఏనెఱెంగుదు నా వలెనే యతండు

పాట పదములకై నిత్య పథికుఁడయ్యె"నని శివుని లీలావిలాసాలను కవి చర్యలతో పోల్చుకొని తనలో భగవంతుణ్ణి చూచుకున్నాడు.

'మహతి' సంపుటంలోని గీతాలలో కవి తననొక అల్పుడిగా భావించుకొని, భగవంతుని సర్వశక్తిమంతునిగా, దయామయునిగా తలచి వివిధ విధాలుగా ప్రార్థించటం కన్పిస్తుంది. బ్రహ్మసమాజం ఆంధ్రదేశంలో మతభేదాలను తొలగించి, విశాల దృష్టిని కలిగిస్తున్న మంచి తరుణంలో కృష్ణశాస్త్రి ఉత్తమ భక్తిగీతాలెన్నిటినో రచించారు.

"అతను బ్రహ్మసమాజానికి ఆ రోజుల్లో ఒక వన్నె తెచ్చాడు. అతని రూపం, అతని ఉత్సాహం, అతని కవిత్వ ధోరణిఅన్నీ బ్రాహ్మమత వ్యాప్తికి తోడ్పడ్డాయి... ఏదన్నా ఓ ఉత్సవం జరిగితే, దాని కనుగుణ్యంగా ఒక పాటరాసి పెట్టమంటే, వెంటనే కృష్ణశాస్త్రి పాటరాసి యిచ్చేవాడు. పాటల అందం అంతా కృష్ణశాస్త్రిదే. ఉద్రేకమంతా చలానిదే" అని భక్తిగీతాలు రచించిన కాలంలో కృష్ణశాస్త్రి వహించిన బాధ్యతను చలం ప్రశంసించారు.

"అనంత సాగరుడు అరుగుదెంచె నేడు / ఆనందమాయె బ్రహ్మానందమాయే; రండు రండు ప్రాణేశుడు / రాకరాక వచ్చెనేడు; జయము జ్ఞానప్రభాకరా ! జయము శాంతి సుధాకరా !" మొదలైన గీతాలు బ్రహ్మసమాజ కార్యక్రమాలు చైతన్యవంతంగా సాగుతున్నప్పుడు రచించినవే.

## 16

"అలనాఁటి ఋషి వాటికలనుండి పఱతెంచు నామ్నాయపూత గంగామృతమ్ము
అలనాటి బోధివృక్షాయతచ్ఛాయల నెలవైన బాష్పశీతల జలమ్ము

అలనాటి కలుత్రెమోడు సిలుప గద్దియ మీఁద నుంచిన రక్తకవోష్ణధార
అలనాఁటి యూరబీయుల యెడారులలోనఁ గాఱిన విశ్వాస ఘర్మవారి

కలిసి నీలోన లోలోనఁ గదలి పాఱఁ
బదను వాఱిన దయ్యా నీ హృదయసీమ
తావక పవిత్ర జీవితధామమైన
దయ్యె విశ్వవిశాల దేవాలయమ్ము"

కృష్ణశాస్త్రిగారి జీవితాన్ని తీర్చిదిద్దినవారిలో బాల్యంలో వారి బాబయ్యగారు, నాన్నగారు, యౌవనంలో ఇక ఆ తర్వాత ఆదర్శంగా నిలిచినవారు బ్రహ్మర్షి రఘుపతి వేంకటరత్నం నాయుడుగారు, వారి బాబయ్య నాన్నగారలపై 'కృష్ణపక్షము'లో ఏడు ఖండకావ్యాలను రచించి తన భక్తిని చాటుకొన్నారు. ఇక నాయుడుగారి సంగతి సందర్భం వచ్చినప్పుడల్లా వినమ్రులై, భక్తిభావంలో స్మరించారు. "మహతి" గీత సంపుటిని నాయుడుగారికి అంకితమిచ్చారు. నాయుడుగారి సూక్తులను "బ్రహ్మర్షిమాట" అనే పేరుతో పద్యాలల్లారు "బ్రహ్మర్షి"గా అఖిలాంధ్రదేశంలో గౌరవాదరాలు పొందిన నాయుడుగారిని కృష్ణశాస్త్రిగారు గురుదేవునిగా సంభావించారు.

నాయుడుగారు కృష్ణశాస్త్రిగారి జీవిత, మత దృక్పథాలను తీర్చిదిద్దారు. సుని శితమైన విశాలదృష్టిని ప్రసాదించారు. సమస్త లోకాన్ని ప్రేమించే శక్తిని యిచ్చారు. "భారతదేశంలో పుట్టి అధ్యాత్మికేచ్ఛాదారిద్ర్యమున నశించే నిజశిష్య శ్రేయమాశించి" జ్ఞానబోధ సల్పేందుకు నాయుడుగారికి శాస్త్రిగారు కృతజ్ఞతలు సమర్పించారు. "ఈ జడ జీవితమును పలికించితివి" అనీ, ఈ అఘపంకమందు అంభోజము మొల్వ జేసితివి, అపూర్వము నీదయ" అని నాయుడుగారిని కొనియాడారు.

ధీరసమున్నతులైన నాయుడుగారు షరాబుతో ఫగిడితో పాదుషాలాగ కన్పించేవారు.

ఋషి వాటికలనుండి ప్రవహించిన గంగామృతము, బోధివృక్షచ్ఛాయలనుండి చిలకరించిన బాష్పశీతలజలము, సిలువగద్దెమీఁద జాల్వారిన రక్తకవోష్ణధార, అరబీయుల ఎడారులలో కారిన విశ్వాస ఘర్మవాః కలిసి, ప్రవహించి నాయుడిగారి హృదయసీమ విశ్వవిశాలదేవాలయమై పవిత్రమైనదని కృష్ణశాస్త్రి భక్తితో స్మరించారు. కురుక్షేత్రము, బృందావనము, ప్రయాగ, వారణాసి పుణ్యభూములలో సంచరించిన అనుభూతి నాయుడుగారు ఎదురుగా నిలిచిన మాత్రాననే కలుగుతుందన్నారు.

ఏబదిసంవత్సరములభినవాంధ్రయువకులను రెండు సోపానములమీద నెక్కించి సత్యసాన్నిధ్యమున నిలువబెట్టిన సోక్రటీసు నాయుడుగారు పాఠశాలయుఁ

ప్రార్థనాలయమును. నధ్యాపక పీఠము నాచార్యవేదికయు బ్రహ్మర్షి గురుదేవుల సన్నిధానమునఁగలసి పోయెడివి.

నాయుడుగారి హృదయము శతతంత్రీమహతి. ప్రతివాయునిహతికిని గంపించిపోయెడివి. ప్రతి శిష్యునితోడియనుభవములేకాక ప్రతికావ్యములోని యనుభవములును నందనా నిలయములై వారి మనస్సునుల్లాత లూగించెడివి. వారి చరణ కమలములను నా హృదయ వేదికపైనుంచుకొని నా శిరస్సును ధూళిలో నుంచు చున్నాను" అని కృష్ణశాస్త్రి తన గురుదేవులకు మ్రొక్కారు.

వధూవరుల జీవితాల నొకటి చేసే 'సప్తపది'ని నాయుడుగారు నూతన రీతిలో నిర్వచిస్తే కృష్ణశాస్త్రి "సత్యరతి, ధర్మగతి, గృహస్థవిధి, అతిధి
అర్చన, స్వదేశసేవన, మఖిలమాన
వానురక్తి, యీశ్వర భక్తియని వధూ వ
రార్హ సప్తపది యనుచు బ్రహ్మర్షి మాట !"
అని దానికి పద్యరూపమిచ్చారు

యౌవనప్రాయంలో నాయుడుగారి చరణ సన్నిధి లభించటాన్ని కృష్ణశాస్త్రి మహాభాగ్యంగా ఎంచుకున్నారు. "అపుడు నాగొంతు రవ్వంత కోయిలగాన
అపుడు నా మనసు అవంత ఊయెలగాన
అపుడు నామనికి తరుణామ్ర శాఖికగాన
ఆలపించితిని అత్యాల్ప గీతులు కొన్ని
అప్పుడే ఒక మంగళా నిలముకొని తెచ్చి
అందిచ్చిపోయె అజరామరము నీవాణి
నాగీతి అప్పుడే నగలన్ని విడనాడి
శిరసు వంచెను ధూళివరకు నీపదమాని" - ఇంతగా
నాయుడుగారి ప్రభావానికి గురి అయినప్పటికీ కృష్ణశాస్త్రి కొన్ని క్లిష్ట పరిస్థితులలో ఆయనను ఎదిరించక తప్పలేదు. జస్టిస్ పార్టీవారి అధ్వర్యంలో జరిగిన బ్రాహ్మణేతరుల సభకు నాయుడుగారు అధ్యక్షత వహించటాన్ని కృష్ణశాస్త్రి ఆక్షేపించారు. కులాలు పోవాలని బ్రాహ్మమతాన్ని అవలంబించిన నాయుడుగారు బ్రాహ్మణేతరుల సభలో పాల్గొనటమంటే కులాలను అంగీకరించినట్లవుతుందని శాస్త్రిగారు వాదించారు. తనకు న్యాయమని తోచినదాన్ని వెల్లడించటంలో కృష్ణశాస్త్రి తన గురుదేవులను ఎదిరించి సత్యప్రధాన నిలబడటానికి సంకోచించలేదు. ఆయన నిజమైన స్వేచ్ఛాజీవి.

## 17

"నానోట నీమాట గానమయ్యే వేళ
నాగుండె నీవుండి మ్రోగింపవా వీణ

రాగమెఱుఁగని వీణ, రక్తినెఱుగని వీణ
తీగపై నీచేయి తీయకే గడియేని

అంతరాంతరము నీ అమృత వీణేయైన
మాట కీర్తనమౌను, మనికి నర్తనమౌను !
ఈయనంత ప్రథాన నేచోటికాచోటు
నీయాలయమ్మౌను, నీయోలగమ్మౌను !"

భక్తిగీతాల రచనలో కృష్ణశాస్త్రి ఉన్నతమైన శిఖరాలను అధిరోహించారు.

"పాటలలో యీయనను దరిజేరగలవారు లేరు" అని ముద్దుకృష్ణ ఏనాడో పేర్కొన్నారు. అన్నమయ్య, రామదాసు, త్యాగయ క్షేత్రయ్యవంటి వాగ్గేయకారుల వారసత్వాన్ని కృష్ణశాస్త్రి పుణికి పుచ్చుకున్నారు. క్షేత్రయ్య తరువాత ఇంతటి వాగ్గేయ కారుడు మరొ పుట్టలేదని సుప్రసిద్ధకవి ఇస్మాయిల్ తలచారు.

మహాభక్తుడైన కృష్ణశాస్త్రి వినమ్రంగా "నేనేదో భక్తకవిని కాను. మీరనుకు నేంత భక్తుణ్ణీకాను కొందరు అనుకునేంత దుర్మార్గుణ్ణీ కాను. ఎప్పుడో హృదయావేదన భరించలేనప్పుడు కేక పెడతాను. అది కీర్తన అవుతుంది" అనేవారు. (తిరుమల రామచంద్ర-మరపురాని మనీషి). భగవంతుని కరుణచేతనే తాను కీర్తనలు రచించినట్లు తెలుపుతూ "అంతరాంతరము నీ అమృత వీణేయైన/మాట కీర్తనమౌను, మనికి కీర్తన మౌను" అన్నారు. ఈ మాటలు ఏ అన్నమాచార్యుడో ఆధునిక కాలంలోకి దిగివచ్చినట్లు తోస్తాయి.

రాగమెరుగని వీణ, రక్తినెరుగని వీణ భగవంతుని కరుణవల్ల గానమొనరిస్తుం దట ! ఇక్కడ వీణ జీవుని వేదనకు ప్రతీక అని వేరే చెప్పనక్కరలేదు.

"అడుగడునకు స్వామి అడుగు సవ్వడి వినిన/ఎడద లోలోన ఎల్లెడల విశ్వము లోన ఈ యాత్ర ముగియునో" అని హాయిగా చల్లగా సాగిపోతానన్నారు.

"గడియేని నీ వియోగము సహింపగలేను
విడిపోని నీచెల్మి విధమేమొ సెలవిమ్మ" అని భగవంతుణ్ణి వేడుకున్నారు.

దేవుడు గుళ్ళో లేడనీ మానవ హృదయంలోనే ఉన్నాడని ఆయన తలచారు.

"గుడిని శంఖముమొరసె, విడెను వాఁకిటి ద్వారము
ఎకడ యెడఁదనునిండె గుడినుండి మాదైవము" అని అందరిలో నెలకొన్న దైవాన్ని తలచుకొన్నారు.

కష్టాలను పోగొట్టి సుఖశాంతులను ప్రసాదింపుమంటూ

"ఇక హిమవంతము వలదు ! ఇక నిశీథము వలదు
నీ సన్నిధియె దేవదేవా
ఒక వసంతముపైన నొక ప్రభాతములోన
ప్రకటింపవా దేవదేవా !" అని వేడుకున్నారు.

అంతులేని జీవితయాత్రలో మనిషి తృష్ణతో తపిస్తున్నాడు.

"ఇంత తెలియని యాత్ర ఇంత కాల్చే ఆర్త
మెంతకాలమొ నాకు దేవదేవా !
అంతరమ్మున శాంతి అంతటా నీకాంతి
అలరింపజేయవా, దేవదేవా !" అని కృష్ణశాస్త్రి దేవదేవుని ప్రార్థించారు.

## 18

"వాడిన తీఁగెకె గడియ గడియ కొక
వసంతకాలము దేవా !
మాడిపోవు నెండకారు నేలకె
మధుర వర్షమో దేవా !!

దారిగాని దారిని నడుగున కొక
తారాదీపము దేవా !
పాఱఁబోసికొన్న పానపాత్రలోఁ
తేనెసోనలో దేవా !!

ఈ విశ్వాసము వీఁడని వారికి
భావిస్వర్గమో దేవా !
ఈయాశా సందేశము జాటెద
మాశాశలనో దేవా !!"

భగవానుడు నివసించని హృదయం చిలుకలేని పంజరం. జీవితమెటు చూచినా ఆతని సర్వకళామయమే, చిద్విలాసమే, తానేమీకాడు.

"వాడిపోయిన తీఁగ మోడువారిన తీగ
పరిమళించినదోయి నీ తోట

విరిసి మురిసినదోయి నీ తోట" అని పలికి కృష్ణశాస్త్రి దేవదేవుని కరుణ వలననే తన జీవితం వాడిపోయిన మోడువారిన తీగే అయినా విరిసి, మురిసి పరిమళిస్తుందని తలచారు.

మహిమాన్వితుడైన భగవంతుని ప్రార్థించేటప్పుడు శైవుడుగానో, వైష్ణవుడుగానో కాక ఏకేశ్వరోపాసకులై "ప్రాణరమణ ! కరుణాభయచరణ !
మౌనిజన హృదయ గగన సంచరణ !
అధమ జీవన ఘన తిమిర సంహరణ !
మధుర మధుర దరహాస ప్రసరణ !"

అని ప్రార్థించారు. కాని కృష్ణశాస్త్రిగారు విగ్రహారాధనకు వ్యతిరేకులు కారు. కొన్నిచోట్ల శివుణ్ణి, కృష్ణుణ్ణి పేరుపెట్టి పిలిచి పూజించటమూ ఉన్నది.

నిరాశ నిస్పృహలలో తనకు చేదోడై భగవంతుడు జీవితంపై ఆశను ఆపేక్షను కలిగించటాన్ని కృష్ణశాస్త్రి వాడిన తీగెకె గడియ గడియకొక / వసంతకాలమొ దేవా !" అనే గీతంలో గానంచేశారు.

మాడిపోయే ఎండాకాలపు నేలకు మధురమైన వర్షంలాగ, దారిగాని దారిని అడుగున కొక తారాదీపంలాగ, పార పోసుకొన్న పాన పాత్రలో తేనెసోనలాగ, విశ్వాసము వీడని వారికి దేవుని చేయూత 'భావిస్వర్గము' అని చాటారు. కృష్ణశాస్త్రి.

కవి తనను తానొక గోపికగా భావించుకొని దేవుని ఆరాధించిన భక్తిగీతాలు కూడ కొన్ని 'మహతి'లో ఉన్నాయి. "దాసిగా నుండుటకైనం
దగనా, ప్రాణేశ, దేవా !
నీ సేవకె గాక నాకీ
నీరస జీవితమేల ?" అని బేలగా ప్రశ్నించే

భక్తురాలి హృదయంతో కృష్ణశాస్త్రి దేవుని అర్చించారు. జయదేవుడు, క్షేత్రయ్య, మీరాబాయి, చండీదాసు మొదలైన భక్తుల కవితాతత్త్వం కృష్ణశాస్త్రి గీతాలలో రమణీయంగా గోచరిస్తుంది.

దేవుడికోసం దేవాలయాలలో వెతకవద్దని ఆయన హెచ్చరించారు.

"శిథిలాలయమ్ములో శివుడు లేడోయి
ప్రాంగణమ్మున గంట పలుకలేదోయి
దివ్యశంఖము గొంతు తెరవలేదోయి
పూజారి గుడినుండి పోవలేదోయి

చిత్ర చిత్రపు పూలు చైత్రమాసపు పూలు
ఊరూర సింటింట ఊరకే పూచాయి
శిథిలాలయమ్ములో శిలకెదురుగా కునుకు
పూజారికొక చేని పూవు లేదోయి
వాడవాడల వాడె! జాడలన్నింటవాడె" - 'వాడి'కోసం ఏ గుడిలోను వెతక వద్దన్నారు.

"అవనియంతా పెద్ద యక్షయ పాత్ర
అఖిలేశు హస్తమే అన్నపూర్ణమ్మ" అని దేవునిలో ఆకలి తీర్చే మాతృ స్వరూపాన్ని తిలకించారు.

భక్తిగీతాలతో కృష్ణశాస్త్రి బ్రాహ్మధర్మాన్ని నూతనమైన శక్తితో, కాంతితో నింపారు. ఆ కాలంలో ఆయనను ఆంధ్రుల తైత్రిలోక్యసన్యాల్ (గొప్ప బ్రాహ్మధర్మ వేత్త; వాగ్గేయకారుడు)గా శ్రీ వేమూరి రామకృష్ణారావు (కాకినాడ పి. ఆర్. కాలేజీ ప్రిన్స్‌పాల్; బ్రహ్మధర్మ వలంబి) అభివర్ణించారు.

## 19

"ఆకాశము నొసట పొడుచు
నరుణారుణ తార
ఏ కాకి నిశీధి నొడుచు
తరుణకాంతి ధార
జయపతాక యువపతాక
వియదాపగ వెడలు నౌక"

1910-30 సంవత్సరాల మధ్య భావకవిత్వం తెలుగు సాహిత్యాన్ని ప్రకృతి - ప్రణయ - దేశభక్తి ప్రబోధాలతో కాంతిమంతం చేసింది. 1930-40 సంవత్సరాల మధ్యకాలంలో శ్రీశ్రీ 'మహాప్రస్థానం'లో గీతాలను వివిధ పత్రికలలో వెలయించారు. అభ్యుదయాన్ని కోరిన యువకవులు శ్రీశ్రీని తమ నేతగా ఎంచుకున్నారు. సమసమాజ నిర్మాణం కవుల లక్ష్యమైంది. కృష్ణశాస్త్రి కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి కావ్యాల లోను ఈశ్వర ఆరాధనకు సంబంధించిన భక్తిగీతాలతోను ఆగిపోకుండ కాలంతో కదలి వచ్చారు. అభ్యుదయాన్ని మనసారా ఆహ్వానించారు. అభ్యుదయ రచయితల సంఘం వార్షికోత్సవాలలో ఒకదానికి అధ్యక్షత వహించారు.

1941 లో స్టూడెంట్సు ఫెడరేషన్ ఆధ్వర్యంలో విద్యార్థి మహాసభ జరిగింది. నిర్వాహకుల కోరిక ననుసరించి కృష్ణశాస్త్రి "ఆకాశము నొసట పొడుచు అరుణారుణ

తార" ఎర్రజండాను వస్తూ పాట రచించినారు. దోపిడికి, దైన్యానికి నిలయమైన ఏకాకి నిశీధిని చీల్చుకొని వచ్చే తరుణ కాంతిధారగా ఎర్రజండాను జయపతాకగా, యువ పతాకగా తలచారు. ఆపదల సముద్రాన్ని దాటించే నౌకగా ఆ పతాకాన్ని కొనియాడారు. యుగయుగాల పీడకలలు, బాధించే సంకెళ్ళు తెగనివి కావన్నారు. ధగధగా మెరుస్తూ స్వతంత్ర విభాతాకాశము నొసట పొడుచు అరుణతారకు స్వాగతం పలికారు. ఆశావాహియై మనజాతికి ముక్తి. అమరజీవశక్తి ముందుగలదు అని చెప్పి అభ్యుదయ విభాతాకాశము కింద వెనుక చూపులేకముందు నడవమని ప్రబోధించారు.

మందికృత మహాయుగం
ముందున్నది ముందున్నది
ముందున్నది ముందే, మరి
మందే యువ మహాయుగం
కలికాలం ముసలి ముసలి
చలికాలం మసిలిమసిలి
కొండచిలువలాగ, పెద్ద
బండలాగ దొర్లిపోయె"నని చెప్పి యువ మహాయుగం వైపుకు సాగండని హెచ్చరించారు.

అప్పటికింకా భారతదేశానికి స్వాతంత్ర్యం రాలేదు. ఆకాలంలో కృష్ణశాస్త్రి

"హే భారత జననీ !
స్వేచ్ఛాగగన వీధీ విహారిణి
స్వతంత్ర స్వర్ణారుణ
కంకణ కటక కలాపినీ" అని భారతమాతకు జేజేలు పలికారు. భారతమాత ఆయన కనులకు సర్వమంగళాకారగా గోచరించింది.

"జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రీ దివ్యధాత్రి
జయ జయ జయ శత సహస్ర
నరనారీ హృదయనేత్రి !"గా ఆమెకు నివాళి సమర్పించారు.

కృష్ణశాస్త్రి కేవల భావకవి మాత్రమే కారు అభ్యుదయ కవుల హృదయాలలో చెలరేగిన అలజడిని గుర్తించి, ఆశీర్వదించి, పథనిర్దేశం చేసిన మహాకవి.

"పీడింపబడేవాళ్ళు పీడించేవాళ్ళు వున్న యీ వ్యవస్థ ఉండాలని ఎవరూ కోరరు. రానున్న విధానంలో సాధారణ మానవుడే మకుటధారి. పురోగమిస్తున్న లోకాన్ని ప్రతిఘటించేవారు. ఎప్పటికీ అభ్యుదయవాదులు కాజాలరు. ఈ ధనిక సమాజం పోవాలనటమే

అభ్యుదయం. ఇది మనసులో పెట్టుకొని వ్రాసేది అభ్యుదయ రచన" అని తృతీయ అభ్యుదయ రచయితల మహాసభకు అధ్యక్షత వహించి రచయితలకు హితోపదేశం చేశారు (తెలుగు తల్లి-1946 మార్చి).

బహుముఖమైన కృష్ణశాస్త్రి కవితాశక్తిని శ్రీ తుమ్మల సీతారామమూర్తి

"కరుణ కలదు ప్రేమ కలదీపికలదాత్మ
కలదు కృష్ణశాస్త్రి కవితయందు
టన్ను బరువు దానికున్నదాయని నొస
లెత్తి యడుగు వానికేటి కోళ్ళు !" అని ప్రస్తుతించారు.

## 20

"దూరదూరాల నీహార తుంగ శృంగ
మకుట మాణిక్యమో ! ప్రభా మండలమ్మొ !
పిలుచు నన్ను పదేపదే నిలువలేను
నాకు జరలేనిదా యౌవనము నిమ్ము !"

జీవించి నన్నాళ్ళూ నిత్యయౌవనులే కృష్ణశాస్త్రి. "ఆ మాటకొస్తే కవి వయస్సెప్పుడూ ముప్పైఏళ్ళే" అంటారు విజ్ఞులు. కాలధర్మాన్ని అనుసరించి శరీరానికి ముసలితనం వస్తున్నా మనస్సుకు మాత్రం ముసలితనం రాకుండ కృష్ణశాస్త్రి కాపాడుకోగలిగారు. అసలాయనకు ముసలితనమంటేనే చెడ్డ చిరాకు ! "శిధిల మందిరంలో అంధకారం"లాగ ముసలితనం మనిషికీ దిక్కుతోచనీయదని ఆయన విసుక్కునేవారు.

అందరానంత దూరాన నిలిచి హిమసన్నిభమైన శిఖరంపై నుండి, తేజోవలయం తనను పిలుస్తూవుంటే, వార్ధక్యం తన శరీరాన్ని మనస్సును కప్పేసి కాళ్ళకు అడ్డంపడి వణికింపజేస్తుంది. అందువల్ల "నాకు జరలేనిదా యౌవనము నిమ్ము" అని ఆయన భగవంతుని వేడుకున్నారు. కాళ్ళు గండశిలలై పోయి కదలలేక మొరాయిస్తున్నాయి. మసకచూపులో, ముందే మున్నదో కానరాక కళ్ళుచీకట్లు కమ్ముతున్నాయి. "ఏకాకిదారి-అంధవైతరణీ ధార; ఆగలేను/నాకు జరలేనిదా యౌవనము నిమ్ము" అని ప్రార్థించారు.
భగవంతునిపై పరిపూర్ణ విశ్వాసం ఉన్న తన పదములు, రెక్కలు, నయన యుగళి ఆరిపోని తారలు, యాత్ర శిశిరమధుర జీవవాహిని''. తన సంకల్పశక్తి సడలిపోనీయవద్దని దేవుణ్ణి కోరుకున్నారు. జీవితం విలువైనది. వెలుగులో ఇతరులతో మధువీచితోడ మరుగువిషకీలతోడ సుమధుర మధురమైన బ్రతుకిది" - ఈ బ్రతుకులో యువకునిగానే కొనసాగ నివ్వు; ముసలితనాన్ని రానీయవద్దని వరం వేడుకున్నారు.

"శీతవేళ రానీయకు - రానీయకు
శిశిరానికి చోటీయకు - చోటీయకు
ఎదలోపల పూలకారు
ఏనాటికి పోనీయకు

ఉదయాన కలతనిదర చెదరిపోవు వేళ
మబ్బులలో ప్రతితారక మాయమయేవేళ
పోయెనా కోయిలల కారు; పోయెను నవమల్లికలవేళ....
ముసలి తనపు టడుగుల సడి ముంగిట వినబడినా

పీటలేదనీ చెప్పించు - పీలు కాదనీ పంపించు'' అని ముసలి తనాన్ని దరిజేరనీయవద్దన్నారు. తుదిశ్వాస విడిచేవరకు ఆయన యౌవనాన్ని ప్రేమిస్తూ ముసలితనాన్ని ద్వేషిస్తూనే గడిపారు.

"ఈ లోకమ్ము దరిద్రతా కృపణతా హింసారి రంసారుషో
ద్వేలోల్లోలములన్ మునింగి వి- యాభీల స్థితిన్ మాయునే
మో-లేకున్న సహోదరాస్థిఫలంమ్ముల్ తిందునే యెందు ? త
త్కీలా లాసవ పాన లాలస మదాంధీ భూతులై మానవున్"

ఒక సంక్రాంతి పండుగనాటి ఉదయం హేమంతపు చలిలో మత్తుగా పడకమీద నుండి లేపటానికి బద్ధకిస్తున్న తలపులను కృష్ణశాస్త్రి 'సంక్రాంతి' ఖండ కావ్యంలో వర్ణించారు. ప్రొద్దున్నే వినవస్తున్న ఆకాశవాణి వార్తలు కవికి ఇబ్బంది కలిగిస్తున్నాయి.

"విననిష్టపడను, వినకు
న్నను తోచదు, విన్నచో మనస్సు వికలమౌ
దినదినము గగనవాణీ

స్వన వీచీనివాహ వార్తావళులన్" అని తన మనస్సులోని భావాన్ని తెలిపారు. కొనియారణమని, మలయా వ్రణమనీ, సమీపిస్తున్న సంగ్రామమనీ వదలని, కరువు కాటకాలనీ, మరణమని-అన్నీ ఆందోళనకరమైన వార్తలే విన్పిస్తుందది. "ఏమిటి యీ లోకం! దారిద్ర్యంతో వేగలేక హింసా ప్రవృత్తిని పెంచుకొని వలయానికి దారి తీస్తుందేమో! లేకపోతే సహోదరుల రక్తమాంసాలను భుజించటానికి మదాంధీభూత చేత స్కులై యీ మానవులు రాక్షసులై పోతున్నారే'' అని కవి తనబాధను వెల్లడిస్తున్నారు.

లోకంలో అంతా ఆందోళనాకరమైన పరిస్థితులే లేవు. కన్నీటి కెరటాలలో గూడ, వెన్నెల వుంది. నిద్రబద్ధకంతో శయ్యవీడని కవిని మెత్తని చేయి తాకింది. "ఏమండీ ఇకలెండి, వాకిటికి రానేవచ్చె సంక్రాంతి ఏమేమో ఎన్నడు యోచనల్ తెగవు మీ రేలాగు కూర్చుందురండీ! మానండి దిగుళ్ళు మీ మనస్సులో'' అని అర్ధాంగి

అనురాగపూరితహృదయంతో మెత్తగా చీవాట్లు పెడుతున్నట్లు లాలనగా మేల్కొలిపింది. "ఎప్పుడో ప్రళయం వస్తుందని పండుగలు మానుకుంటామా!" అని నిద్రలేపి పండగ సంబరాన్ని చూపింది.

కవిగారి కూతురు సీత గోమయ హిమవారికలయంపు నీళ్ళు చల్లింది. ఇంటి ముంగిట, పరిసరాలలో కనిపిస్తున్న సంక్రాంతిశోభ ఆయనను ఆహ్లాదపరచింది.

"మసరు సరసాలంత మగువ చెవిలో సుంత
గుసగుసలుగానెవో కొసరితినా లేదో
మిసమిసల యెల నగవులొస పరి పెదవి దాచి
విసరుకొను చిల్లాలు వీటిలోపలికేగె" - సంక్రాంతి పండుగనాటి యీ జీవన దృశ్యం మనస్సును ఆహ్లాదంతో నింపుతుంది.

## 21

"ప్రేయసి సోయగమ్మునకు లేదు శరీరము; లేదు మేను నా
తీయని ప్రేమకేని, కలదే యెడబాటిక మాకు; శ్యామలై
హాయస సీమ కార్తికిక యామవతీ హసితమ్ము వోలెననా
బాయదెదో వెలుంగొ - మధువాసనయో -"

భావ కవిత్వం వెలుగును విరజిమ్ముతున్న దశలో ఈ పద్యం రసజ్ఞుల గుండెల్లో గూడుకట్టుకొన్నది. సహృదయ శేఖరులు శ్రీ ఆచంట జానకిరామ్ యీ పద్యాన్ని ఒక చక్కని కార్డుమీద రాసుకొని తమ కారులోముందు అద్దంమీద అంటించుకొని, నిరంతరమూ చదువుకుంటూ ఉండేవాడినని, తన స్వీయ చరిత్రాత్మకమైన 'నాస్మృతి పథంలో' తెలిపారు.

ప్రేయసి ప్రేమలో స్వర్గాన్ని చవిచూచిన కవి ఆమె సంయోగంలోనే గాక వియోగంలో కూడ ప్రణయ మాధుర్యాన్ని పొందారు. ఆమె తలపే తన బ్రతుకుకొక పర్వదినంగా భావించారు. అహరహమూ ఆమె తలపులలో తన అస్తిత్వాన్ని మరచారు.

"రేయికొసన్ పసిండి నునురేకలు ప్రాకకమున్నె పైనమై
పోయెడు మూగవీవలుల పుంతల నల్లననేగుదెంచి, నే
నే యెలుగెత్తి నీ నిలయ నిస్సరణమ్మున నిల్చిపిల్తు - నా
ప్రేయసి - ప్రేయసీ, యని చలింపగ యుష్మదుషస్సుషుప్తులే!" అనే సుకుమారమైన ప్రణయభావన యువ హృదయాలకు సోకింది.

''ఏమృగ తృష్ణనో మలచి యేడ్చెదు" అని ఎగతాళి చేసేవారికి సమాధానంగా కవి ప్రేయసి సోయగమునకు శరీరము లేదు; నా తీయని ప్రేమకు మేసులేదు" అని చెప్పి మాకింక ఎడబాటెక్కడ ? అని ప్రశ్నించారు. తన ప్రియురాలు మృగతృష్ణ కాదనీ, "శ్యామలైహాయససీమ కార్తికిక యామవతీహసితము" లాగ తనను వీడిపో వని వెలుగని జవాబిచ్చారు.

కార్తికమాసపు వెన్నెల జల్లులాగ కృష్ణశాస్త్రి ప్రణయకవిత హాయిని గొల్పు తుంది.

## 22

"ప్రాణసఖుడె నాకోసమై పంపినాడు
పల్లకీ అన హృదయమ్ము జల్లుమనియె
వీడని వియోగమున వేగు మోడుమేను
తలిరు తోరణమై సుమదామమాయె
కొసరు నడల తూగాడుచు కూరుచుంటి
పూలపల్లకిలో పూలమాల నేను
'ఓ'యనగ 'ఓహా హో'యన బోయవాండ్రు
దారిబడి నిల్చిచూచె ఊరూరునాడు."

ప్రియురాలిని తన ఇంటికి తీసుకొని వెళ్ళటంకోసం ప్రియుడు పల్లకీ పంపాడు. ఆమె హృదయంలో పెక్కు విధాలైన తలపులు పొడసూపాయి. ప్రాణసఖుడె నాకోసమై పల్లకీ పంపినాడనుకోగానే ఆమె హృదయం జల్లుమన్నది. మేను పులకించింది. వీడని వియోగంచేత మోడై పోయిన మేను చిగురుటాకుల తోరణమె, పూలదండలా మారి పోయింది. మధుకలలు ఆమె మనస్సును కాల్చివేస్తున్నాయి. మబ్బుల చీరలు, పొద్దు పొడుపునగలో, ఏదో మనస్సును కాల్చే హాయియో, తేల్చే భారమో ఏదీ భరించలేక పోయింది.

ఆమె కూర్చుండగానే పల్లకీ కదిలింది. కొసరు నడకలలో ఆమె తూగాడుతూ కూర్చున్నది. పూలపల్లకీలో పూలమాలగా తనను భావించుకొన్నది. "ఒహాం ఒహాంభో" అంటూ బోయీలు పల్లకీ మోస్తున్నారు. ఆ సుందర దృశ్యాన్ని ఊరూరా ప్రజలు దారిన నిలబడి చూస్తున్నారు.

బోయీలు 'ఓ'యనగ, ఓహొహో అంటూ ఊతంకోసం కేకలు పెడుతుండగా వీటి వెలుపల తోట తెరువు మేల్కొన్నది. ఆ ప్రాతఃకాలంలో బోయీలు 'ఓ'యనగ 'ఓహొహో' అనగా తోట పొలిమేరలో కాలువ నిదురలో తొణికింది.

పల్లకీలో కూర్చున్న ముగ్ధవధూ సౌందర్యాన్ని, పూల పల్లకీలో పూలమాలలాగ కూర్చున్న ఆమె తీరునూ, బోయీల సంరభాన్ని, వేడుకను ప్రశాంత ప్రకృతిని అందులో తోట తెరువు మేల్కొని, కాలువ నిద్రలో తొణకినప్పటి పక్షుల కలకలాన్ని, ఎన్నిటినో మరపురానంత మనోజ్ఞంగా యీ కావ్య ఖండికలో తీర్చిదిద్దారు. కవి తనను వధువుగా భావించుకోవటంలో వీరుడు ఆ దేవదేవుడేనన్న స్ఫురణ కూడ ఉన్నది.

## 23

"నాకనందన హరిచందనముల కన్న
కరము ప్రియములు చేమంతి విరులు హరికి
ఆరు కాలాలు తిర్నాళ్ళకనుచువేచి
పూచి యిచ్చును కైంకర్యమునకు వాని !
హారాలై మెడజుట్టి అంగదములై అంసాళిపైమెట్టి, లే
తోరాలై చెయిపట్టి యూగు, చనవెంతోగాని శ్రీజానితో
ధారాళమ్ములు క్షీరసాగర సుధా ధమిల్ల మాల్యమ్ములన్
హేరాళమ్ములు పీఠి కాపురవసీ హేమంత చేమంతికల్"

వైష్ణవ గీతాలలోని పరిపక్వత కృష్ణశాస్త్రి కవితలలో గుబాళిస్తుంది. ఆండాళ్ల 'తిరుప్పావై'ని తెలుగు చెయ్యటానికి ఆయనకంటె తగినవారెవరు ? భక్తిశబ్దంమీద భక్తీ, ప్రపత్తీ అన్నీఉన్న కవి ఆయన. అన్ని ఋతువుల శోభను, ప్రకృతి కాంత లీలా విలాసాలను కళ్ళారాచూచి మనసారా అనుభవించారాయన. హిందూ వేదాంతాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చెయ్యడమేగాక, ఏ దేవుడికి ఏ పువ్వులు ఏ పత్రి, ఏ అలంకారాలిష్టమో ఆయనకు బాగా తెలుసు.

స్వర్గం లోకంలోని నందనోద్యానపు హరిచందనములకంటె విష్ణుదేవునికి చేమంతి విరులు ప్రియమైనవి. స్వామివారి కైంకర్యం కోసమని ఆరు కాలాలు తిరునాళ్ళకనుచు పూచి చేమంతులు తమను సమర్పించుకుంటాయన్నారు.

దేవతలు తీసుకొని వచ్చిన కల్ప ప్రసూనమాల స్వామివారి అడుగులబడి ఒదిగి వుంటుందట ! తామొసగే చేమంతికాదామము శ్రీనివాసుని శ్రీవత్సకౌస్తుభమును చేరు కుంటుందని తలచారు కృష్ణశాస్త్రి. స్వామివారికి అలంకారమైన చేమంతులు హారాలై ఆయన మెడజుట్టి, భుజకీర్తులై భుజాలను చుట్టుకొని, హస్తాలంకారాలై చేయి పట్టుకొని వూగి ఎంతో చనవుతో లక్ష్మీదేవి కొప్పులోచేరి శోభాయమానంగా ఉంటాయన్నారు. హేమంతంలో పిఠాపురంలో పూచిన చేమంతులకు విష్ణుదేవునితో యీ సాన్నిహిత్యం అబ్బుతుందన్నారు.

మెత్తనైన చేమంతి రేకులు శ్రీవారి తిరుమేను హత్తుకొంటుందని ఒత్తిగిలవు. పానుపైన సమయంలో కూడ చేమంతులు ఉండీలేనంత మెత్తగా ఉంటాయి. ధనుర్మాసంలో కుంతీ మాధవస్వామి లక్ష్మీదేవితో కూడి తపస్వులు, వేల్పులు, ప్రపన్నులు కొల్వగా వేంచేసి కొలువు తీరుస్తారు.

పుష్పసార్థకతను వెల్లడించటంలో కృష్ణశాస్త్రిగారి భక్తి చక్కగా వెల్లడైంది.

"అసలు శ్రావణమాస మధ్యమ్మునందు
కురిసి తీరాలి వర్షాలు; కొంచె కొంచె
మేని రాలాలి తుంపరలేని; కాని
ఉక్కమేమాత్రమూ ఉండరాదు''

భావ కవిత్వమూ వాడుక భాషోద్యమమూ చెట్టాపట్టాలు వేసుకొని సాహిత్య సీమలోకి ప్రవేశించాయి. 'భావకవి' ఖండకావ్యంలో పద్యాలలో కృష్ణశాస్త్రి వాడుక భాషను సొగసుగా ప్రయోగించారు. వింతవింత ఊహలు, కోర్కెలు చమత్కార ధోరణిలో సాగిన యీ కావ్యం ఉల్లాసాన్ని కలిగిస్తుంది.

ఆషాఢంలో తొలకరి జల్లులు తాపంతో దహించుకుపోతున్న మేనులకు సౌఖ్యాన్ని కలిగిస్తుంది. శ్రావణమాసంలో వర్షాలు కురిస్తే ఎడతెరిపి లేక కురుస్తాయి లేకపోతే ఆగిఆగి కురుస్తాయి. ఒక్కొక్కప్పుడు నాలుగు చినుకులుపడిపోయి ఇక తర్వాత ఉక్క చెడ్డబాధ పెడుతుంది. శ్రావణమాసంలో వర్షాలు కురవాలి గాని ఉక్క ఏ మాత్రం ఉండకూడదని మన భావకవిగారి కోరిక. తుంపరలు రాలినా ఉక్కమాత్రం పోయ కూడదట! తాను లావెక్కి, కాస్తంత ఎటు కదిలినా చెమటపోసి, వర్షామేఘం లాగ అయిపోతాడు-పైనేమో కొండమీద మబ్బు వొట్టిపోయింది. "ఓసి పడమటిగాలి-నీఇల్లు బంగారంగాను-అవసరంలేని చలికాలంలో మామీద ఎగసిపడతావు గాని యిపుడు మసల వేం?

ఆంధ్ర సాహిత్య పరిషత్ అధ్యక్షుని ఈ మాట అడిగితే "అలసిసొలసి వాలెను కరుణావరోధ భామినీ గండ కర్పూర పాళులందు'' అని నీ సంగతి చెప్పాడు. కాని నాకామాట నచ్చలేదు. భావకవిని కాబట్టి "ప్రియావియోగనిబిడ నిశ్వాసములు రేగినేడు ముసర/పందరూ గుండెలేని వారగుట చేత!'' అని చెప్పాడు-ఏమంటే

"వారికీ మాకు ఉన్నదావంత తేడ
లేని మేనకతో వారు ప్రేమలేని
ఉపరతుల మున్గిపోతారు; ఉన్న చెలియ
సోయగము మాకు ఊర్వశి తీయదనము''

భావకవిని ఇంత గొప్ప చేసినప్పటికీ సమయం వచ్చినప్పుడు తమను తాము పరిహాసం చేసుకోగలిగిన హాస్యకుశలత శాస్త్రిగారిలో పుష్కలంగా ఉన్నది.

గిరజాలు, సరదాలు, మెరుగు కళ్ళజోళ్ళు ఎన్నో ఉన్నాయి-భావకవి "గట్టివాడన్నింట కవిత్వానన్ దక్క" అని హేళన చేయటం ఆయనకే చెల్లింది. ఈ పద్యంలో వర్ణించిన వేషం ఆయనదే. తన కవిత్వాన్నే గాక వేషాన్ని గూడ అనుకరించిన భావకవులను ఆయన ఎగతాళి చేశారు.

## 24

"మనసున మల్లెలమాల లూగెనే
కన్నుల వెన్నెల డోల లూగెనే
ఎంతహాయి ఈరేయి నిండెనో
ఎన్నినాళ్ళకీ బ్రతుకు పండెనో"

సినిమాలకు పాటలు రాయటం తేలికైన పనికాదు. సినిమాలలో సన్నివేశాలకు అనుగుణమైన పాటలురాసి, ఆ సినిమా ప్రభావం తగ్గిపోగానే పాటకూడ మరుగున పడిపోతూ ఉంటుంది. సినిమాకోసమే రాసినా కలకాలం జ్ఞాపకముంచుకోదగినవీ ఉత్తమ కావ్యాలనదగిన పాటలు రాసిన ఖ్యాతి కృష్ణశాస్త్రిగారిదే.

తెలుగు సినిమా ప్రపంచంలో 'మల్లీశ్వరి' ఒక రసవత్తరమైన దృశ్యకావ్యం. ఆ సినిమాలో అన్ని పాటలూ కృష్ణశాస్త్రిగారే రచించారు. శ్రీసాలూరు రాజేశ్వరరావు (సంగీతము) శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు, శ్రీమతి పి. భానుమతి (గానం) శ్రీ బి. ఎన్. రెడ్డి (దర్శకత్వం) కృష్ణశాస్త్రిగారల అపూర్వమైన కలయికతో ఆ సినిమా చలన చిత్రసీమలో చెక్కుచెదరని కళాఖండంగా రసజ్ఞుల మనస్సులలో నిలిచిపోయింది. భావితరాలకు గూడ మార్గదర్శకంగా నిలుస్తుంది.

"ఉయ్యాలా! జంపాలా! రావిచెట్టూ మీద ఊయాలా!; కోతీ బావకు పెళ్ళంట; పరుగులు తీయాలీ-గిత్తలు ఉరకలు వేయాలీ; పిలచిన బిగువటరా; ఛళిరా, ఎన్నడు జారె నీ భువికి; ఔనా నిజమేనా; ఎందుకో నీకింత తొందరా! నెలరాజా వెన్నెలరాజా!" ఏపాట కాపాటే ఒక రసగుళిక.

"ఆకాశవీధిలో హాయిగా ఎగిరేవు! దేశదేశాలన్ని తిరిగి చూసేవు! ఏడ తానున్నాడొ-బావ/జాడ తెలిసిన పోయిరావా! అందాల ఓ మేఘమాలా!" అనే పాటలోనాయికా నాయకులు మేఘంద్వారా సందేశం పంపుకోవటం ప్రధానమైన విషయం. కాళిదాసు మేఘసందేశం తర్వాత ఇంతమంచి కావ్యం సంస్కృతాంధ్ర భాషలలో రాలేదేమో?

రాణివాసంలో పంజరపు చిలుకలాగ బందీ అయిపోయిన మల్లీశ్వరి చాలాకాలం తర్వాత, రహస్యంగా తన ప్రియుని కలుసుకోవటం కోసం పంపాసరోవరతీరంలో ఒక రాత్రిపూట వేచి ఉంటుంది ఆసమయంలో ఆమె "మనసున మల్లెలమాల లూగెనే/ కన్నుల వెన్నెల డోలలూగెనే / ఎంతహాయి యీరేయి నిండెనో / ఎన్నినాళ్ళకీ బ్రతుకు పండెనో" అనుకుంటుంది. "గడియయేని యిక విడిచిపోకుమా / ఎగసిన హృదయము పగులనీకుమా" అని పాడుతున్నపుడు శ్రోతలు గుండెలు చిక్కబట్టుకొని వింటారు. గాఢమైన నిట్టూర్పు విడుస్తారు. తెలుగు సినిమాలలో ఇంతగా పండిత పామరులందరినీ ఆనందింపజేసిన పాట మరొకటి లేదు.

## 25

"లుళ లుళ లుళా-ఆయి.... ఆయి-ఆయీ ఆయీ-ఆపదలు కాయీ
తాధిమి తకధిమి తోల్‌బొమ్మా
దీని తమాష చూడవె తోల్‌బొమ్మా
నాలుగుదిక్కుల నడిమి సంతలో
తూలేతుళ్ళే తోల్‌బొమ్మా ! తూలేతుళ్ళే బొమ్మా
ఎవ్వరికెవ్వరే మౌతారో !"

శ్రీ బి. ఎన్. రెడ్డి దర్శకత్వం వహించిన 'బంగారుపాప' సినిమా జాతీయ స్థాయిలో ప్రశంసలు పొందింది. అందులో ఒక కఠినాత్ముడి మనస్సు పరివర్తన పొందటానికి ఒక పాపాయి కారణమౌతుంది. జీవితంలో అన్నివిధాలా నష్టపోయి, ప్రేమకు ప్రతిఫలంగా ప్రేమ లభించక మోసానికి గురై, కసాయివాడిగా మారిపోయిన ఒక మనిషి కథ ఇది. పగ తీర్చుకోవటం కోసం ఎదురుచూస్తున్న ఆ మనిషి ఉక్కు గుండెల్ని కేరింతలతో పాపాయి కరిగిస్తుంది. ఇక ఆ తర్వాత ఆ పాపకోసమే జీవిస్తాడతను.

సమాజ న్యాయచట్టం అతనికి శిక్ష విధిస్తుంది. చెరసాలనుండి తిరిగి వచ్చాక పాపాయి పెద్దదై అతన్ని మర్చిపోతుంది. అది విషాద సన్నివేశంలో ఆ మనిషి ఆలపించిన తత్త్వమిది. పాపాయి బొమ్మను లాలిస్తూ, జోల పాడినట్లు లుళ లుళ లుళా-ఆయి "అని పాడతాడు. జనన మరణ లీలలను పామర వేదాంతులు తత్త్వాలలో కీర్తనల్లో పలికినట్లు "తాధిమి తకథిమి తోల్‌బొమ్మా-దీని తమాష చూడవె తోల్‌బొమ్మా / నాలుగు దిక్కుల నడిమి సంతల్లో/తూలేతుళ్ళే తోల్‌బొమ్మా/ఎవ్వరి కెవ్వరే మౌతారో" అంటాడు. "ఆటమ్మా, పాటమ్మా జగ/మంతా బొమ్మలాటమ్మా "అని జనన మరణాలన్నీ విధి ఆడుకునే బొమ్మలాటగా తలుస్తాడు.

ఈ దృశ్యాన్ని చూచినా, ఈ పాటవిన్నా సహృదయులు కన్నీళ్ళు విడవకుండ

వుండలేరు. ఈ సన్నివేశంలో లోక వంచనకు గురైన వ్యక్తిగా మహానటుడు శ్రీ యస్వీ రంగారావు నటించి, ఆ సన్నివేశానికి, ఆ పాత్రకు జీవంపోశారు.

కృష్ణశాస్త్రిగారికి మిక్కిలి ప్రియమైనది కరుణరసం. "వేదనా ప్రేమా కలిస్తేనే కరుణ. కరుణ సృష్టిస్తుంది. కరుణ శైథిల్యంలోనుంచి చైతన్యాన్ని పుట్టిస్తుంది కరుణ బోధివృక్షం-కరుణ సిలువ-కరుణ సదర్మతి, ఊరికేబాధ చాలదు. కన్నీరు రావాలి. మేఘాలు పట్టవచ్చు. వర్షం కురియకపోవచ్చు. కన్నీటిభాగ్యం మానవునికే ఉంది." అంటారాయన (నా స్మృతి పథంలో-విజయనగరం మహారాజా కళాశాల-1971)

## 26

"నీవుండేదాకొండపై ! నాస్వామి! నేనుండేదీనేలపై
ఏ లీల సేవింతునో! ఏపూల పూజింతునో
శ్రీ పారిజాత సుమాలెన్నో పూచె
ఈ పెదరాలి మనస్సెంతో వేచె
నీపాద సేవ మహాభాగ్యమీవా
నాపైని దయజూపవాస్వామి"—

ఈశ్వరారాధన కృష్ణశాస్త్రి కవితలో ఒక ప్రధానభాగం-ఇది అవకాశం ఉన్నప్పుడల్లా ఆయన రాసిన సినిమా పాటల్లో గూడ వ్యక్తమైంది- 'భాగ్యరేఖ' సినిమాలో ఒక అభాగిని భగవంతునికి తన ఆత్మను నివేదిస్తుంది. ఇది కృష్ణశాస్త్రి ఆత్మార్పణే! నీవు నాకు అందరానంత ఎత్తులో వున్నావు. నేను ఇంతదూరంగా యీ నేలపై వున్నాను. నిన్నే విధంగా సేవించగలనో! ఏపూలతో పూజించ గలనో! నీ పాదసేవా మహాభాగ్యం కోసం యీ పేదరాలి మనసెంతో వేచియున్నది. నాపైని దయచూపవా స్వామి! దూరాననైనా నిన్ను చూచే భాగ్యమీయవా? నీ రూపు నాలో సదానిలువ నీయవా!" అని వేడుకునే భక్తురాలి భావం కృష్ణశాస్త్రి నివేదనమే.

"నీదయలాగున వెన్నెల జగమంతాముంచే। నీ వేణువుకోసం బ్రతుకంతా వీనులాయే। నేరుతునో లేదో ప్రభు। నీపాటలుపాడ" మరొక దీనురాలి వేదనను 'పూజాఫలం' చిత్రంలో విన్పించారు. ఇదికూడ కృష్ణశాస్త్రి భక్తిని చక్కగా వెల్లడిస్తున్నది.

కొండమీద కూర్చున్న దేవిని చేరుకోలేనని ఆశక్తతను తెలుపుకుంటూ "కోటి మెట్లబడి రాలేను। ఏ పాటి కానుకలు తేలేను!" దొడ్డనగలు నీకెన్నో ఉండ। గడ్డిపూసరులె ఇవి విందా?" అని చేలగా పలికారు. భగవంతునికి పాదదాసిగా భావించు

కాని, కృష్ణశాస్త్రి తన హృదయంలో ఆర్తిని పైపాటలో వెల్లడించారు. అవి ఆ సినిమాలలో చక్కగా సన్నివేశానికి కూడ సరిపోవటం విశేషం.

## 27

"ఇది మల్లెల వేళయని। ఇది వెన్నెల మాసమని
తొందరపడి ఒక కోయిల
ముందే కూసిందీ!
విందులు చేసింది!"

రచించిన సినిమా పాటలన్నీ కవిత్వమే అనిపించే విధంగా రచించిన ఖ్యాతి తెలుగు సినిమా కవులలో కృష్ణశాస్త్రిగారికేవున్నది. ఆయన పాటలలో మార్దవం సినిమా ప్రేక్షకులందరికీ తెలుసు. "ఆయన పాటలు పాడే పాత్రలు గొప్పకవులు కానక్కర్లేదు. అయినా వాటిలో స్వచ్ఛమైన కవిత్వం వుంది! ఈ సామరస్యాన్ని సాధించిన జీనియస్‌ను విశ్లేషించటం నాకు సాధ్యంకాలేదు" అని కొడవటిగంటి కుటుంబరావుగారు కృష్ణశాస్త్రిగారి సినిమా పాటల ఔనత్యాన్ని కొనియాడారు.

'సుఖదుఃఖాలు' సినిమాలో ఒక సామాన్యపాత్ర సన్నివేశానికనుగుణంగా పాడిన పాట "ఇదిమల్లెల వేళయని। ఇది వెన్నెలమాసమని। తొందరపడి ఒక కోయిల। ముందే కూసింది। విదులు చేసింది!" అనేది. అయినా జీవితంలో ఎన్నో సందార్భాలకు యీ పాటను వర్తింప జేసుకోవచ్చు.

"కసిరే ఎండలు కాల్చుననీ। ముసిరేవానలు ముంచుననీ. ఎరుగని కోయిల ఎగిరింది విరిగిన రెక్కల ఒరిగింది। నేలకు ఒరిగింది। మరిగి పోయేది మానవ హృదయం। కరుణ కరిగేది చల్లనిదైవం। వాడే లతకు ఎదురైవచ్చు। వాడని వసంత మాసం। పసిపాడని కుసుమ విలాసం। ద్వారానికి తారామణి హారం। హారతి వెన్నెల కర్పూరం। మోసం ద్వేషంలేని సీమలో। మొగసాల నిలిచే, నీ మందారం" అనే యీ పాటలో "కరుణ కలిగేది చల్లనిదైవం" అనే సందేశం మహత్తరమైనది.

సృష్టి అంతా కృష్ణశాస్త్రిగారికి ఆనందగీతంగా తోస్తుంది. ఆ ఆనంద గీతంలో విషాద గాంభీర్యాన్ని చూపి నిట్టూర్పు విడుస్తారు "ఒక ఉదయం నేను నా యింట బయలు దేరాను. సమస్త సృష్టి ఒకేఒక ఆనందగీతం లాగున ఉంది. రోడ్డు పాడుతోంది. నా కారు పాడుతోంది-గాలీ, చెట్టూ, పిట్టా సర్వమూనూ! అప్పుడే ఉదయించిన ఉదయవేళ కదా! అప్పుడే ఒక కుక్క ఎటునుంచి వచ్చిందో కులాసాగా తలాతోకా ఆడిస్తూ రోడ్డుకు అడ్డుగానడిచి కారుకిందపడి ఒక్క అరుపుఅరచి చచ్చి పోయింది. నాకారు చక్రానికి రక్త అంటుకుపోయింది. కారు ఆపలేదు డ్రైవరు.

నాకుమార్తెమీద అలాగే నిష్ఠుర వేగంతో, వెనక్కి తిరిగి చూడని రథచక్రం వెళ్ళి పోయింది" — పెళ్ళీడుకు ఎదిగిన కూతురు సీత హఠాత్తుగా జబ్బుచేసి చచ్చిపోతే ఆ శోకాన్ని తాను బతికున్నన్నాళ్లూ అనుభవించారాయన. సమస్త సృష్టినీ ఆనంద గీతంలా భావించ గలిగికూడ అందులో దాగిన విషాదపు అపశ్రుతిని గుర్తుచేసి గుండె కలుక్కుమనేలాగ చేశారు.

## 28

"శ్రీశైలం మల్లన్న శిరసొంచేనా
చేనంతా గంగమ్మా వానా
తిరుమలపై వెంకన్న కనువిప్పేనా
కరుణించు ఎండా వెన్నెలలైనా"

కృష్ణశాస్త్రిగారి పాటలు కొన్నిసినిమాలకు అపరిమితమైన గౌరవాన్ని కలిగించాయి సామాన్యమైన కుటుంబగాథాచిత్రాలకు కూడ ఆయన పాటలు అతికినట్లు సరిపోనాయి. "ఉండమ్మా బొట్టుపెడతా!" అనే సినిమాలో శ్రీశైల మల్లికార్జునుని పైనా, పైరు పచ్చాలపైనా, పండుగ పబ్బాలపైనా, పాతాళ గంగపైనా రాసినపాటలు ఉత్తమ కావ్యాలుగా పేర్కొనదగినవి,

శ్రీ శైలం మల్లన్న శిరసొంచేనా చేనంతా గంగమ్మా వానా! అనే పాటలో శబ్దార్థాలంకారాలు చక్కగా కలిసిపోయి ఉత్తమ కవిత్వంగా రూపు దిద్దు కొన్నాయి. "తిరుమలపై వెంకన్న కనువిప్పేనా కరుణించు ఎండా వెన్నెలలైనా" అని తిరుపతి వేంకటేశుని దయవల్ల, శ్రీ శైల మల్లికార్జునుని కరుణవలనా పంటలు బాగా పండాలని నాయికా నాయకులు కోరుకుంటారు. "ఏటికైన ఏతాము ఎత్తే వాళ్ళం మేమూ, అన్న దమ్ములం ఏడేడు గరిసెల్లూ నూర్చే వారం మేము, అక్కా చెల్లెళ్లం" అనే చోట కలిసి కట్టుగా స్త్రీ పురుషులు పని చేస్తే కరువే రాదనీ, రాజ నాలపంట పండుతుందనీ తలుస్తారు.

"రావమ్మ మహాలక్ష్మీ రావమ్మా! గంగమ్మారా - గంగమ్మరా! పాతాళ గంగమ్మరా! ఉరికురికి ఉబికుబికిరా! అడుగడుగున గుడిఉంది అందరిలో గుడి ఉంది; చాలులే, నిదురపో! జాబిలికూనా!" అనే పాటలు యీ చిత్రానికెంతో విలువను చేకూర్చాయి.

"చాలులే నిదరపో! జాబిలికూనా! ఆ దొంగ కలువ రేకుల్లో తుమ్మెద లాడేనా! నీ సోగ కన్నుల రెప్పల్లో తూనీగ లాడేనా" పాటలో వున్న పదాల పొందిక హృద్యమైనది. కళ్లను 'దొంగ కలువరేకలు'గా భావించటం కృష్ణశాస్త్రి ప్రతిభకు చక్కని నిదర్శనం.

## 29

"ఊరకే కొలను నీరు ఉలికి ఉలికి పడుతుంది
ఓరగా నెమలిపింఛ మారవేసుకుంటుంది
ఎందుకో ప్రతి పులుగూ ఏదో చెప్పబోతుంది!
వనములో చెట్టు చెట్టు కనులు విప్పిచూస్తుంది!
ఉండుండీ నాఒళ్ళు ఊగి ఊగి పోతుంది"

రామ కథ కరుణ రస భరితం. శ్రీరాముని జీవిత ఘట్టాలను తెలిపే పాటలను 'సంపూర్ణరామాయణం' సినిమాలో కృష్ణశాస్త్రి అత్యద్భుతంగా వర్ణించారు. మిగిలిన పాటలన్ని ఒక ఎత్తు. శబరి శ్రీరాముని కోసం ఎదురు చూచిన పాట మరోకెత్తు. వాల్మీకి హృదయాన్ని తెలుగులో రామాయణ రచయిత లెందరో ఆవిష్కరించారు. కాని కృష్ణశాస్త్రి గారి కఠం నుండి కరుణ పొంగి పొరలింది.

శ్రీరాముని రాక కోసం సర్వప్రకృతి నిరీక్షిస్తున్నది. కొలను నీరు రాముని తలచుకొని ఉలికి ఉలికి పడుతున్నది. అడవిలో నెమలి ఓరగా పింఛాన్ని ఆరవేసు కొంటున్నది. ఎందుకో ప్రతి పులుగు ఏదో చెప్పబోతున్నది. "ఏదో చెప్పాలను కొంటున్న పక్షిజటాయువే. సందేహం లేదు-సీతాపహరణాన్ని చూచి రావణునితో యుద్ధంచేసి రెక్కలు తెగి పడిపోయి వున్నది కదూ! సొమ్మసిల్లిన ఆపక్షి ఏదో చెప్పాలనుకొని చెప్పలేక పోతున్నది, పులుగు అంటే జటాయువు అనే కృష్ణశాస్త్రి గారు తలచినట్లు మిత్రులు ఎమ్వీయల్ గారు అభిప్రాయపడ్డారు. వనంలో ప్రతి చెట్టు రాముని కోసం కనులు విప్పి చూస్తున్నది. శబరి ఆస్థితిలో "ఉండుండీ నా ఒళ్ళు ఊగిఊగి పోతున్నది." అనుకొన్నది. అడుగో రామయ్యే! ఆ అడుగులు నా తండ్రివే! ఇదిగో శబరీ శబరీ వస్తున్నానంటున్నవి? కదలలేదు వెర్రి శబరి, ఎదురుచూడలేదని నా కోసమె నా కోసమె నడచి నడచి నడచీ నాకన్నా నిరుపేద నామహరాజు! పాపం" అనుకొంటున్నది శబరి.

"నాకోసమె నా కోసమె" అని రెండుసార్లు నడిచి నడిచి నడిచి అని మూడుసార్లు అనిపించటంలో శబరి హృదయంలో ఆతృతను భక్తిభావాన్ని చక్కగా వ్యక్తంచేశారు. "నా కన్నా నిరుపేద నామహరాజు" అనటంలో మహరాజు నిరుపేద అనటంలో ప్రేమ సంపదకు దూరమైనాడని ధ్వనించటమే.

శ్రీరాముడు దయచేస్తే శబరికి చూపు ఆనలేదు! ఆపయి కన్నీరు! తీరా దయచేసిన నీ రూపుతోచదాయె నయ్యోయ్యో - ఏలాగో రామా! ఏదీ ఏదీ ఏదీ-కొలను నడిగి తేటనీరు, కొమ్మనడిగి పూలచేరు, చెట్టునడిగి పుట్టనడిగి పట్టుకొచ్చిన ఫలాలు, పుట్టతేనె రసాలు - దోరవేవో కాయవేవో-ఆరమగ్గినవేవో గాని ముందుగా రవ్వంత

చూసి-విందుగా అందియ్యనా?" అని రాముణ్ణి వేడుకుంటున్నది. అడవిలోనుంచి తెచ్చిన ఫలాలను తేనెనేగాక శబరి స్వచ్ఛమైన మాతృ హృదయాన్ని కృష్ణశాస్త్రి వర్ణించారు. శబరి మనస్సులోంచి ఆయన తన రామభక్తిని చాటుకున్నారు

'భక్తశబరి' సినిమాలో కూడ కృష్ణశాస్త్రి శబరి మనస్సులో తలపులను చక్కగా వెల్లడించారు. "అదిగో యిదిగోయని మరి ఎదురరయుట చేతగాదు! ఎదురుగ వద్దామంటే ముదుసలి ఇది కదలలేదు ! పుడలిన వవ్విదివాడునా తొడిమ వీడి పడిరాలునా అడుగుల కడ రామాయని పడితే అంతే చాలును" అనుకొంటుంది శబరి రాముని చరణాలే తనకు శరణమని తలచిన కవి, శబరి మనస్సులోనుంచి పలికారు.

## 30

"ముందు తెలిసెనా, ప్రభు! ఈ
మందిరమిటులుంచేనా ?
మందమతిని, నీవు వచ్చు
మధురక్షణమేదొ కాస్త ముందు తెలిసెనా....

అందముగా, నీ కనులకు విందులుగా వాకిటనే
సుందర మందార కుంద సుమదళములు పరవనా ?

కృష్ణశాస్త్రిగారి గళం మూగబోయాక రచించిన గేయ సంపుటికి 'కృష్ణరజని' అని పేరు పెట్టారు. కృష్ణరజని అంటేచీకటిరాత్రి అని అర్థం. అంతేగాక కృష్ణశాస్త్రి సాహిత్యం రజని సంగీతం అని కూడ అనిపించేటట్లు ఆ పేరు పెట్టారు. ఈ సంపుటిలో కూడ ఈశ్వరారాధనకు సంబంధించిన గేయాలున్నాయి. భగవంతుడు కరుణించి హఠాత్తుగా తన మందిరానికి విచ్చేస్తే భక్తురాలు పొందిన ఆవేశం పైగేయంలో ఉన్నది. ముందు తెలిస్తే ప్రభూ ! ఈ మందిరాన్ని యీ విధంగా ఉంచేదానినా ? నీవు వచ్చే మధుర క్షణమేదో కాస్త ముందుగా తెలిస్తే, నీ కళ్ళకు విందుగా వాకిటిలో సుందర మందార కుంద సుమదళములు పరవనా ? స్వామి ఏమి నీ లీల ! బ్రతుకంతా ఎదురు చూచే సమయంలో రానేరావు. ఎదురుచూడని వేళ వచ్చి ఇట్టె మాయమౌతావు ? కృష్ణ రజని గడిచేదాక "నిన్ను కదలనీక, నీ పదముల నా హృదయాన్ని సంకెలగా బంధింప లేను. దారి పొడుగునా మంచున తడిసి పారిజాత సుమములపై నడిచిన నీ అడుగుల గుర్తులు నా కోసం నిలిచి వున్నాయి. "ఆ పదముల సేవా భాగ్యమేచాలు"నని ఆమె తృప్తిపడుతున్నది.

పండితులు, విమర్శకులు కవుల రచనలలోనుంచి వారి తాత్త్విక దృక్పథమేదో తెలుసుకోవటానికి ప్రయత్నిస్తుంటారు. వాళ్ళకు కృష్ణశాస్త్రి కవిత్వం ఒక గడ్డు సమస్య

అవుతుంది "ఒక్కొక్కప్పుడు ఆయన పిలిచే భగవానుడు నిర్గుణుడు, నిరాకారుడు ఒక్కొక్కప్పుడు స్పష్టమైన మూర్తితో సాక్షాత్కరించే రాముడో, కృష్ణుడో, శివుడో"- ఒక్కొక్క భక్తుడు, భక్తురాలు కృష్ణశాస్త్రి ఒక్కొక్క అవతారం.

ఈ గేయంలో మాత్రం ఏకేశ్వరోపాసనే ప్రధానంగా కనిపిస్తుంది.

## 31

"వేయబోవని తలుపు తీయమంటూ పిలుపు
రాధకెందుకో నవ్వు గొలుపు
నీలోన నాలోన నిదుర పోయేవలపు
మేలుకుంటే లేదు తలుపు!

విశ్వమంతా ప్రాణవిభుని మందిరమైన
వీధి వాకిలి ఏది చెల్లెలా!
విశ్వవిభుడే రాధవెంట నంటీరాగ
పిలుపేది తలుపేది చెల్లెలా!"

ఆకాశవాణిలో నాటికలకూ సంగీత నాటికలకూ కొదవలేదు. కాని కృష్ణశాస్త్రి రచించిన "కృష్ణాష్టమి" యమునా విహారి; ఏడాది పొడుగునా అనే సంగీత నాటికలవల్లా, 'క్షీరసాగర మధనం, విప్రనారాయణ' అనే యక్షగానాలవల్లా, ఆకాశవాణి ఉనికి సార్థకమైంది. కృష్ణాష్టమిలో భాగవత హరివంశాల సారాంశమంతా నిండిపోయి, శ్రోతలు ప్రేపల్లెవాడలో ఆనందజలధిలో మునిగి తేలుతున్న భావన కలుగుతున్నది.

శ్రీకృష్ణుని జననంకోసం యశోద, నందుడు, రాధ, ఉద్ధవుడు ఇంకా ఇతర గోపికలు ఎదురు చూస్తుంటారు. ప్రకృతిలో ఎన్నెన్నో చోద్యాలు వాళ్ళకు కనిపిస్తాయి. ఈ వింత లీలాటివే రేయిచూచెనె! ఏవీటి యతిథి ఇపుడేగుదెంచెనె వేగుకన్నులు విచ్చి వేచి యుండుటె కాని తూగదే, నిదురలో తోగదేమో మాయిల్లు!" అనుకొంటుంది రాధ. పెరటిలో కడిమిశాఖ రవంత ఓరగా తిరిగి, కనువిరిసి మందిరంలోకి తొంగి చూస్తున్నది పొదులెల్ల కరగగా మొదవు వెన్నెలపాలు కాలువలు కడుతున్నాయి. ప్రసవవేదన పడుతున్న యశోదతో రాధ "వదినమ్మా! వినవమ్మా! ఏ పాల కడలి నీలో పొంగునో కాని తడియు నీ తెలిరైక-తడియు నీ వెలిపైట" అంటుంది. ఊరి పొలిమేరలో వెదురు పొదలు మోరలెత్తి పాడుతున్నాయి.

"ఒక తలిరుటాకు తుదయేని, ఒక లతాగ్ర
మేని, తలయోప; దొకసూనమేని వలచి
ఉస్సురన, దే నిరీక్షణ నున్నయది యొ -
రః విభావరివేళ బృందావనమ్ము" అనుకొంటాడు ఉద్ధవుడు యమునా నది కెరటాల చప్పుడును ఆపి, మూగపోతుంది.

శ్రీకృష్ణుడు పుట్టగానే రాధ ఎత్తుకొని ముద్దు చేస్తుంది.

"అదిరా ! అదిమాయసిదరగదరా !
కదిలే రెప్పలవెనక మెదిలే తుమ్మెద లవిగ
నా చక్కిలిగిలి సైచినంగనాచి ఏమౌదువు
పూచే నవ్వుల, మంకెన పూ పెదవుల దాచలేవు !
మేలుకొన్నవాని లేప బేలయశోదమ్మగాను
ఏలా నీ లీలలు నాత్రమోల నీలమోహనా !" అని శ్రీకృష్ణుణ్ణి జోకొడుతూ ముద్దపాలు చేస్తుంది

పురిటిగది తలుపు తీయమని గోపికలు తలుపు తడతారు.

వేయబోవని తలుపు తీయమంటూ పిలుపు

రాధకెందుకో నవ్వుగొలుపు" అంటుంది రాధ. "శ్రీకృష్ణజననంతో లోకమంతా ప్రేమమయమే. "నీలోన నాలోన నిదురపోయే వలపు, మేలుకుంటే లేదు తలుపు
విశ్వమంతా ప్రాణవిభుని మందిరమైన, వీధి వాకిలియేది చెల్లెలా !
విశ్వవిభుడే వెంటనంటేరాగ పిలుపేది తలుపేది చెల్లెలా !
అని రాధ అనగానే అందరూ గొల్లున నవ్వుతారు.

విశ్వమంతా ప్రాణవిభుని మందిరమని తలచిన కృష్ణశాస్త్రి విశాల హృదయానికి జోహారు చెయ్యాలనిపిస్తుంది.

## 32

"మ్రోయింపకోయ్ మురళి
మ్రోయింపకోయ్ కృష్ణ !
తీయతేనియ బరువు
మోయలేదీ బ్రతుకు ! మ్రోయింపకోయ్
మురళిపాటకు రగిలి మరుగు నీ వెన్నెలలు
సొగయు నా ఎదకేల తగని సౌఖ్యజ్వాల ? మ్రోయింపకోయ్ !"

తెలుగులో కృష్ణభక్తితో పరవశింప జేసిన కవులను తలచుకుంటే ఎఱ్ఱాప్రెగడ, పోతనల తర్వాత కృష్ణశాస్త్రిగారే జ్ఞాపకం వస్తారు. సహృదయులను ఆనందింపజేయటమేగాక, ఆ పారవశ్యంలో తాను కూడ కొట్టుకొనిపోతున్న భావన కలుగుతుంది. తన నొక గోపికగా భావించుకొని కృష్ణుని మురళీరవానికి పులకించి, పులకించి సౌఖ్యాన్ని భరించలేక చేయెత్తి మొక్కుతున్నట్లనిపిస్తుంది.

"కృష్ణా! మ్రోయింపకోయ్ మురళి! తీయతేనియ బరువు యీ బ్రతుకు మోయలేదు. నీ మురళి పాటకు రగిలి వెన్నెలలు మరిగిపోతున్నవి. సొక్కిపోతున్న నా ఎదకి తగని సౌఖ్యజ్వాల లెందుకు? నీ మురళీరవంలో జాలువారుతున్నది కాల్చే చల్లదనమో, కనలే తీయదనమో తెలియటంలేదు వలపు పిల్లనగ్రోవి పిలుపులో, సొలపులో తెలియటంలేదు. నీ మురళీరవం ఇంక చాలు, ఆనందం భరించలేను. నీ అలముకొనే కలలలో నిదురిస్తాను నీ ప్రేమభరమోయి! నేటిరేయి వరమోయి! తీయ తేనియ బరువు మోయలేదీ బ్రతుకు, మురళిని మ్రోయింపకోయి!" అని భక్తి పారవశ్యంలో గోపిక మొక్కులిడుతున్నది.

మురళిని సంబోధించి మరొక గీతంలో "సందెలను కాళింది అందెలు
సందండించేవు మురళీ!
మందమందపు టూరుపుల ఎద
అందగించే దెవరు మురళీ!
ఆల పొదుపుల పాలకడవల
అమృతముంచే దెవరు మురళీ!
నీలినీలి పిపాళి కన్నుల
నీరునించేదెవరు మురళీ!"

అవి ఆనందబాష్పాలు నిండిన కళ్ళతో కృష్ణునికి, కృష్ణశాస్త్రి కైమోడ్పు ఘటించారు. "కార్తిక రాత్రుళ్ళు కరిమబ్బుంటుందా? కాలమేఘము ఆకాశం వదలి నేలను నడుస్తుందా?" అని నీల మేఘశ్యాముని రూపాన్ని చూపి ఆయన ఆనందంలో తేలిపోయారు.

## 33

"మధూదయంలో మంచి ముహూర్తం
మాధవీ లతకు పెళ్ళి!
మాధవి పెళ్ళికి మల్లీ మాలతి
మందారం పేరంటాళ్ళు!

కొమ్మ కొమ్మ కొక సన్నాయి
రెమ్మ రెమ్మ కొక గవాయి
కొమ్మా రెమ్మా కలిసి మామిడి
గుబురంతా ఒకటే హాయి !"

కృష్ణశాస్త్రిగారు పూలల్లో పక్షుల్లో ప్రకృతిలోని సమస్తంలోనూ ఈశ్వరుణ్ణే దర్శించారు. పూలతో, పక్షులతో ఆయన మనుష్యులతో మాట్లాడినట్లు మాట్లాడతారు 'మల్లీశ్వరి' సినిమాలో "కోతిబావకు పెళ్ళంట ! కోవెల తోట విడిదంట ! మల్లి మాలతి వస్తారా ! మాలికలన్నీ తెస్తారా ? బంతీ జాజీ చామంతీ ! బంతులు కట్టి తెస్తారా ? పెళ్ళికి మీరూ వస్తారా ? పేరంటానికి వస్తారా ?" అని పూలను పెళ్ళి పేరంటానికి ఆహ్వానించారు.

పై గీతంలో పెళ్ళి మాధవీలతకు ముహూర్తం మధూదయంలో మంచి ముహూర్తం. మాధవి పెళ్ళికి, మల్లీ, మాలతి, మందారం పేరంటాళ్ళు ! కొమ్మ కొమ్మ కొక కోకిల కూర్చొని సన్నాయి ఊదుతున్నాయి. కొమ్మా రెమ్మా కలిసి మామిడి గుబురంతా ఒకటే హాయి ! నందనమంతా పందిరి అయితే మస్తృణ కిసాలయ మండపమైతే ! మాధవీలతకు మాధవ దేవుడు మంగళసూత్రం కడతాడు" అని మనోజ్ఞమైన కళ్యాణ దృశ్యాన్ని రూపు కట్టించారు.

మరొక గేయంలో "మల్లెనమ్మా, మల్లెనే నా ఒళ్ళు సందెల జల్లనే" అని మల్లె పువ్వు, దేవదేవుని తలచుకొని మురిసిపోవటాన్ని తల్లి కొలనులో అలలపై ఊగే కలువను, పచ్చనాకుల రాణివాసంలో సుఖించే సంపంగిని, దారి పజ్జను గడ్డి సెజ్జను దాగివుండే బీదపూవును-ఎన్నిటినో తెలిపి, పూల మనసుల్లో వున్న ఆరాధనా భావాన్ని సున్నితంగా వెల్లడించారు.

మధుమాసం కృష్ణశాస్త్రిగారికి మిక్కిలి ప్రియతమైంది. ఏ చెట్టు పూచినా ఏ పక్షి కూసినా, ఏ పిల్లగాలి వీచినా పరవశించిపోయి మధురమైన గానంలో తేలిపోతారు. ఆయన పులకరింతలు ఎన్నెన్నో పాటలుగా తెలుగు జాతికి లభించాయి.

## 34

"వెన్నెలలా వేళనే వేణువూదేనా
వేణువూదిన వేళా వెన్నెలాయేనా
రెల్లు పూలా పానుపుపైన జల్లుజల్లులుగా
వెన్నెల యెవరు చల్లేరే !

ఆలపొదుగుల పాలకడవల
వెన్నలేమోనే వెన్నెల వెన్నలేమోనే!
నడవ నడవల స్వామి అడుగుల
చిన్నెలేమోనే వెన్నెల చిన్నెలేమోనే!"

వెన్నెలవర్ణనలు సంస్కృతాంధ్ర కావ్యాలలో కోకొల్లలు అయినా కృష్ణశాస్త్రి రచనలో ప్రత్యేకత వున్నది వెన్నెలను చూచినప్పటి కవి మనస్సులో మెదిలిన భావాలను ఆత్మాశ్రయరీతిలో వెల్లడించటమూ, వెన్నెలను పరమాత్మని స్వరూపంగా ఎంచటమూ ఆయన వర్ణనల్లో చెప్పుకోదగిన విశేషాలు.

వెన్నెలా వెన్నెలా వెన్నెలో-ఓ
వెన్నెల్ల పూవత్తి వెన్నెలో-ఓ
మల్లెల్లో కనబడదు వెన్నెలా-ఆ
తెల్లని పూవత్తి వెన్నెలా!" మల్లెలలో మొల్లలలో కలిసిపోయి కనపడని వెన్నెల మరెక్కడ కనబడుతుంది?

"నిదురపోయే యిసుక తిన్నెలా
కొలని అలలా కలువ దొన్నెలా
వెదురు పొదలా తెరువులోనా
వెదకి చూచే రాధ కన్నులా
ఆలపొదుగుల పాలకడవల"లో కనిస్తుంది. వెన్నెల నీడలు నీలమేఘశ్యాము నిలాగా మనోహరంగా ఉంటాయి. అందుకే

"నడవనడవల స్వామి అడుగుల
చిన్నెలేమోనే వెన్నెల చిన్నెలేమోనే? అంటారు కృష్ణశాస్త్రి.

వెన్నెల అనగానే ఆయన మనస్సు బృందావనానికి పరుగెడుతుంది. యమునా తీర నికుంజాలూ, ఇసుక తిన్నెలూ, వేణునాదమూ, గోపికల అన్వేషణమూ మనసులో మెదిలి, అడుగడుగునా స్వామి పాదముద్రలను చూచి ఆ నల్లనయ్యను కనలేని గోపికలాగ ఆయన తల్లడిల్లిపోతారు.

## 35

"ప్రతిరాత్రి వసంత రాత్రి
ప్రతిగాలి పైరగాలి
బ్రతుకంతా ప్రతినిముషం పాటలాగ సాగాలి
ప్రతినిమిషం ప్రియా, ప్రియా పాటలాగ సాగాలి!

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ రచించిన 'ఏకవీర' నవల తెలుగులో కావ్య గౌరవాన్ని సంతరించుకొన్న ఉత్తమ రచన. దీన్ని దృశ్యకావ్యంగా మలచటానికి కృష్ణశాస్త్రి గారి పాటలు చక్కగా తోడ్పడ్డాయి.

నాయికా నాయకులు కలుసుకున్నప్పటి యుగళగీతాలెన్నో వున్నా తెలుగు సినిమాలలో ఇటువంటి మంచి పాటలు అరుదు.

"నీలో నాపాట కదలీ !
నాలో నీయందె మెదలీ
లోలోన మల్లె పొదల
పూలెన్నో విరిసి విరిసీ
మనకోసం ప్రతినిమిషం మధుమాసం కావాలి
మనకోసం ప్రియా, ప్రియా మధుమాసం కావాలి" అనే భావాలు అపురూపమైనవి. ఆ ప్రియులకు జగమంతా జంటగా కన్పిస్తుంది.

"ఒరిగింది చంద్రవంక ఒయ్యారి తారవంక
విరజాజి తీగసుంత ఒరిగింది మావిచెంత" - "ఎంతపాటి చల్లని చిఱుగాలి సోకినా జలఝలా వర్షించే అశ్రుభరంలాగ" ఆయన మనస్సులో ప్రేమ భావం పాటగా మారి పన్నీటిజల్లు కురుస్తుంది.

## 36

"నారాయణ ! నారాయణ ! అల్లా అల్లా !
మాపాలిటి తండ్రీ ! నీ పిల్లల మేమెల్లా ! నారాయణ
మతమన్నది నా కంటికి మసకైతే
మతమన్నది నీ మనసుకు మబ్బైతే
మతంవద్దు, గితంవద్దు, మాయామర్మం వద్దు, నారాయణ ...

కృష్ణశాస్త్రి మానవతావాది. రాజా రామమోహన రాయ్‌తో ప్రారంభమైన మానవోద్యమంతో ప్రభావితులయ్యారు. కులాలు, మతాలు మానవులు నిర్మించుకున్న అడ్డుగోడలన్న సంగతి ఆయన తెలుసుకున్నారు. బ్రహ్మర్షి వేంకటరత్నం నాయుడుగారి ప్రభావంతో సర్వమత సామరస్య దృక్పథాన్ని అలవరచుకున్నారు. కళావంతుల వివాహాలు, అస్పృశ్యతా నివారణకోసం పాటుపడ్డారు.

మత సామరస్య దృష్టితోనే యీ పాటను నారాయణ ! నారాయణ! అల్లా! అల్లా! అని ప్రారంభించారు. "మతమన్నది నా కంటికి మసకైతే మతమన్నది నీ

మనసుకు మచ్చైతే, మతం వద్దు, గీతం వద్దు. మాయామర్మం వద్దు" అని ఖండితంగా పలికారు

రాముడు, కృష్ణుడు, శివుడు అల్లా ఎవర్ని గురించి రాసినా మత తత్త్వంతో రాయలేదు. అలాగని కృష్ణశాస్త్రి నాస్తికులు కారు-మానవాతీతమైన శక్తిని దేవునిగా నమ్మి-బ్రాహ్మ్యధర్మాన్ని అవలంబించారు. మనిషిలోని మంచితనానికి నివాళిపట్టి, ఆ మంచితనాన్ని పెంచటానికి తన సాహిత్యం ద్వారా పాటుపడ్డారు.

"ద్వేషాలూ, రోషాలూ తెచ్చేదే మతమైతే, కలహాలూ కక్షలూ కలిగించేది మత మైతే మతంవద్దు, మారణహోమం వద్దు" అన్నారు. మతమన్నది గాంధీ జీవితమైతే మతమన్నది హితమైతే, హిందువులం, ముస్లిములం అందరమూ మానవులం, అందరమూ సోదరులం"అని సౌభ్రాతృత్వాన్ని పెంపొందించుకోమన్నారు.

మతకలహాలు మానని పుండులా బాధిస్తున్న సమాజానికి యీ గీతం గొప్ప ఉప సేవన. పదేపదే మననం చేసుకోవలసిన గేయమిది. గాంధీజీని కృష్ణశాస్త్రి ఆదర్శ మాన వునిలాగ తలచారు. "కమ్మగా బతికితె గాంధీయుగం-మనిషి కడుపునిండా తింటె గాంధీజగం" అని ఆయన ఉద్దేశ్యం.

ప్రజల శక్తిపై కృష్ణశాస్త్రిగారికి అచంచలమైన విశ్వాసం ఉన్నది "తరలిందదె ప్రజారథం పొరలింది ప్రపంచపథం ఇదిమాత్రం నిజమనవోయ్ తుదిసమరం ముగిసిం దని రాగలదని శాంతియుగం కాగలదభ్యుదయ జగం"అని ఆశావాదులై అభ్యుదయ జగాన్ని ఆహ్వానించారు.

## 37

"కలదొకపల్లె-అది ఏదైతే నేం ?
తెలుగునాట ఉంది-అది యాడుంటేనేం ?
కాలువ ఒడ్డున ఒదిగి నీడ చూసుగునేదో
చేలనడుమ పడుచులాగ చేయెత్తి పిలిచేదో
కొండపక్క నిలిచేదో
తోటవెనక కాస్తకాస్త తొంగితొంగి చూసేదో
ఏదో ఒక పల్లె-అది యాడుంటేనేం ?"

తెలుగుపల్లెల అందచందాలను, తెలుగుజాతి జీవనాన్ని కృష్ణశాస్త్రి 'ఏడాది పొడు గునా' అనే శ్రవ్యరూపకంలో మనోజ్ఞంగా వర్ణించారు. తమ్ముడిపెళ్ళికి పుట్టింటికి వచ్చిన

ఆడుపడుచుకు స్వాగతం పలకటంతో ప్రారంభమవుతుంది యీ నాటిక. తెలుగువారి ఆచారాలూ, మర్యాదలూ పలకరింపులూ ఎంతో చక్కగా తెలిపారు.

దూరదేశంలో ఉన్న భర్తను తలచుకుంటూ, పాపాయికి జోలపాడుతున్న అమ్మాయి

నవ్వంటే జాబిల్లి పువ్వంటే మల్లి !
నవ్వేటి పువ్వంటే నా చిట్టితల్లి !
దొంగా కళ్ళల్లో తొగల రేకుల్లో
తుమ్మెదలు మొదలు మళ్ళీ మళ్ళీ
నీ దొంగ కళ్ళేమొ దూలాల పైని !

మీనాన్న కళ్ళేమొ బాలల్ల పైని!" అని పాడుతుంది. దొంగా కళ్ళల్లో తొగల రేకుల్లో'' అనే పదాల ప్రయోగంలో కృష్ణశాస్త్రి అమోఘమైన భావుకశక్తి కన్పిస్తుంది.

రగులు వలపుజల్లు ! మరలిరావు మన ఇంటికి సేతుకారు దిగుళ్ళు చీకటిరాత్రుళ్ళు

"గుమ్మము ముంగిట కోయని కోయిల ఆర్చె
కోయిల కన్నాముస్నే గున్నమావి ఊర్చె
మావి కన్నముస్నె మాయల మారుతమ్ము వీచె
మలయానిలు కన్నముస్నె మల్లె పొదలు లేచె" నని ఇంటి అల్లుడు ఉగాదిని వర్ణించటంతో యీ నాటిక ముగుస్తుంది.

'ఏడాది పొడువునా' కన్పించే గ్రామ జీవన శోభను యీ నాటికలో కృష్ణశాస్త్రి హృద్యంగా వర్ణించారు.

## 38

"గోపురం తండ్రి అయితే, కోనేరు తల్లి. చల్లనినీటి అలలతో మాలిన్యం కడుగుతుంది. తీయని పానీయంతో దాహం చల్లార్చుతుంది. స్వచ్ఛ గంభీరమైన హృదయం ఉంటుంది కోనేటికి. మృదుల విశాలమైన ఊయెలవంటి అంకమూ ఉంటుంది కోనేటికి "

కృష్ణశాస్త్రి పద్య కావ్యాలు, గేయ కావ్యాలకు ఏమాత్రం తీసిపోనివి ఆయన వచన రచనలు. ఇవి ఆలస్యంగా అచ్చు కావటంవల్ల చాలామంది ఆయనను కృష్ణపక్షం రచించిన కవిగానే జ్ఞాపకం ఉంచుకున్నారు. "కోవెల - కొలను; సువాసన ద్రవ్యాలు; మా ఊరు పోయింది; మా ఊళ్ళో వీధి అరుగు; గుహుడు; బూట్ పాలిష్; రిక్షావాలా; అవ్వ

తిరునాళ్ళలో తప్పిపోయింది; పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము; అప్పుడు పుట్టి ఉంటే; బసవరాజు అప్పారావు మధురస్మృతి; ఏకాంత సేవ పీఠిక; అన్నమాచారి" దేనికదే చవులూరించే రచనలు. ఈ శతాబ్దపు ఉత్తమ వచన రచయితలలో కృష్ణశాస్త్రి గణుతింపదగిన వారుగా యీ రచనలు నిరూపిస్తాయి.

దేవాలయాలకూ వాటి ముందుండే కొలనులకూ అవినాభావ సంబంధాన్ని 'కోవెల కొలను'లో తెలిపారు.

దేవళములో గంట గణగణా మోగినప్పుడు, పుంత దారులలో తలలూపుతూ పోయే అలమందలు అట్టే ఆగి ఒక్కసారి తలలెత్తి తిరిగి మెల్లగా కదులుతాయి. కోనేటిలో గలగలలాడుతూ పొరలే చిరు కెరటాలు కూడ ఒక్కసారి ఆగి, ఊపిరి బిగబట్టి విని, మరీ కరిగిపోతాయి."

"ఒక్కొక్క కోనేరు పుష్కరిణి. దీనిలో పద్మాలుంటాయి. కొన్ని కోనేరులు కైరవిణులు. వీటిలో తెల్ల కలువ లుంటాయి. ఒక్కొక్క దేవళపు కోనేటిని గుండ మంటారు. కోవెలలో అడుగు పెట్టటానికి, కోనేరు అనుమతి ఇవ్వాలి. కోవెలకు కోనేరు ఉత్తరువు.... కోనేరుతల్లి అందరనూ కడిగి కడిగి శుభ్రపరచి, వెన్నుచరచి, అనుమతి ఇచ్చి, అలల గలగలల ద్వారా అభయమంత్రం చెవిలో ఊది దేవాలయంలోకి పంపిస్తుంది."

"దేవళంలో కాగడాలే కాని విద్యుద్దీపాలు బాగుండవు. విద్యుద్దీపాల కాంతికి అవధి ఉంది. దుస్సహమైన స్పష్టత ఉంది. కాగడాల పక్కనే పొంచివున్న చీకట్లు మన అంతరంగాలంతలోతుగా ఉంటాయి. కాగడాలు కునుకుతూ దేవాలయాన్ని వింతగా చూపిస్తాయి. కాగడాలు ఊగుతూ కొలనులో వెలుగు తరగలను లేపుతాయి ..." నాగరకతాభివృద్ధిని మెచ్చలేని సనాతనులు కారు కృష్ణశాస్త్రి. కాని దేవాలయంలోకి ప్రవేశించినప్పటి ఆయన అనుభూతిని అర్థం చేసుకుంటే విద్యుద్దీపాలను ఆయన ఎందుకు వద్దంటున్నారో అర్థమవుతుంది.

## 39

"కాలికి పూసినట్లు తొడిగిన షర్వా, పైన జలిబిలి నగషీ అంచుల పలచని అంగరఖా, ఆపైని కుచ్చుతో ఒయ్యారపు బంగారు జలతారు కమ్మీల పగిడీ, సుర్మా కాలికి చడావులు, భుజంపైన ఎర్ర రుమాలు, చంకన ఎర్ర బొండాయిగుడ్డ చుట్టిన పెట్టె, వీటిలో అత్తరు సాయెబు దివాణము హజారములోనేగాక గొప్పవారి లోగిలి వాకిలిలోనే గాక, సామాన్యుల పెండ్లి పందిళ్ళలో కూడా సాక్షాత్కరించేవాడు."

అత్తరుసాయెబునే ఇంతఇదిగా వర్ణించటమా! యీరచన మొదట చదువుతూ వుంటే ఏమహావ్యక్తిని గురించో మనం తెలుసుకోబోతున్నా మనుకుంటాం. తీరాచూస్తే అత్తరు సాయెబు! ఒక్కొక్క మనిషిని అత్తరుపేటికలాగ రోజురోజంతా గుబాళింపజేసే అత్తరుసాయెబు యీవర్ణనకు అర్హుడే. మహాకవి దృష్టిలో అల్పమైన దైనా అనల్పమైనదైనా వర్ణ్యవస్తువు జీవంతో కదలాడుతుంది.

లేవడిబ్రతుకు ఏకాలంలోనైనా లేవడిబ్రతుకే భోగులజీవితం పూర్వకావ్యాలకే పరిమితమైనట్లు కన్పిస్తుంది. మనస్సులు ఇంజనులయి పోయిన కాలంలో అన్నివాసనలు ఒక్కటిగానే తోస్తాయి.

"సువాసన పిలుపువంటిది; పసిమంది నాకర్షిస్తుంది. సౌరభం పక్షివంటిది: దిక్కుదిక్కులా గాలిమీద పరుగెత్తుతుంది సుగంధం స్మృతివంటిది; పదేపదే స్ఫురిస్తుంది పరిమళం పట్టుకుని విడువని బలవంతపు బంధువుకాదు, తరిచూచి దరియవచ్చేనేస్తం. ఆమోదానికి స్వార్థంలేదు. కలిసికట్టువనం ఎక్కువ అందరికీ అనుభవం పంచిపెడుతుంది"

సువాసన, సౌరభం, సుగంధం, పరిమళం, ఆమోదం అన్నిటికీ ఒకే అర్థమిస్తున్నవి. నిఘంటువు సామాన్యులకు యీపదాలన్నీ వొకటే కాని మహాభోగి కృష్ణశాస్త్రి అతిసూక్ష్మమైన వాటి భేధాలను అంతరంగంతో అనుభవించి చెప్తుంటే కాదనటమెలా ? "అప్పుడు పుట్టి ఉంటే" నేనే పెద్దన్ననై పుట్టిఉందును" అని భావించే కృష్ణశాస్త్రి యీవిధంగ అనుకోవటంలో ఆశ్చర్యం లేదు -ఆనందమే ఉన్నది.

## 40

"పగలు మనకళ్ళు కనబడినంత మేరేచూస్తాయి రాత్రిరామాయణందాకాచూస్తాము"

మహానగరంలో చాలాకాలం జీవించిన తర్వాత యాంత్రికజీవనంతో విసిగిపోయి తన సొంతవూరిని తలచుకొని మధురోహలలోతేలిపోయారు. కృష్ణశాస్త్రి "మాఊరు పోయింది, మాఊళ్లోవీధి అరుగు, అనేరెండు వ్యాసాలలో తన ఊరి ముచ్చట్లను మధురాతి మధురంగా తెలియజెప్పారు.

"మా ఊరు వెళ్ళిపోతాను వెంటనే వెతతా వెళ్ళి అక్కడ, చక్కని చల్లని ఇల్లు కడతా-పూరిల్లు. ఇంటి చూరులంట కాంతీ, చల్లదనమూ ఎప్పుడూ నామీదికి జారుతూ ఉంటాయి" అన్నారు. కాని యీతలపు తలగానే మిగిలిపోయింది. హజారంలో కనిపించే దొరవారు; డివాణానికి ఎదురుగా రావిచెట్టు; పక్కనే రామకోవెల వీటితో తమ ఊరు చంద్రంపాలెం (తూర్పుగోదావరి జిల్లా) "అరిమోడ్పు కన్ను" లాగ ఉంటుందని తెలిపారు.

రావిచెట్టు కింద రాత్రిపూట జరిగే పురాణకాలక్షేపంలో "శాస్త్రిగారిగొంతు ద్వాపరయుగం నుంచి వస్తుంది. పగలు మన కళ్ళు కనపడినంత మేరేచూస్తాయి. రాత్రి రామాయణం దాకా చూస్తాయి. ఆముదం దీపం కూడా పురాణం ఆలకించటం నేనెరుగుదును" అంటారాయన.

ఈ శతాబ్ది ఆరంభంలో తెలుగు నాట చాలా పల్లెటూళ్లు ఇలాగే వుండేవి. చంద్రంపాలెంలో కూచిమంచి తిమ్మకవి జన్మించి ఆ వూరికి పేరుప్రఖ్యాతులు తెస్తే మళ్ళీ యీకాలం కృష్ణశాస్త్రి ఆ ఊరిని సాహిత్యంలో చిరస్మరణీయం చేశారు 'వీధి అరుగు' లాంటి సామాన్యవిషయంపై కృష్ణశాస్త్రి కవితాదృష్టిప్రసరించి దాన్నొక కళాఖండంగా తీర్చింది.

తన స్మృతి పరంపరను ప్రస్తావిస్తూ కృష్ణశాస్త్రి "కొన్ని స్మృతులుదిగులు కలిగిస్తాయి మనస్సులోకి వచ్చి మునిమాపు చీకట్లో మందిరంలోనికివచ్చిన గబ్బిలాల్లాగ మరికొన్ని ఉదయాన్నే ఇంటి కిటికీలో నుంచి లోనికి చొరబడి గిలిగింతలు పెట్టో ఒళ్ళు నిమిరో లేపే సూర్యకిరణం లాగు గాలి కెరటం లాగ ఉంటాయి. కొన్ని అదపాదడపా పెళ్ళి పందిట్లో అత్తరు వాసనలాగ తగుల్తాయి. వేరొకకొన్ని క్రేవనే ఉన్న ఇల్లాలి కుంతలాల నుంచి తటాలున సాంబ్రాణి వాసనలాగ స్ఫురిస్తాయి. కొన్ని వేసంగి సందెలో మల్లితావిలాగ పులుగుకూతలాగ హాయి అనిపిస్తాయి అన్నారు. ఈస్మృతులను తమ ఊరి గురించిన వ్యాసాలలో ఉన్నాయి. చాలాకాలం తర్వాత తమ ఊరికి వెళ్తూ "చంద్రంపాలేనికి త్రోవ ఇదేనా? అని వాకబు చేశారు. అవును ఈ రోడ్డక్కడికే పోతుంది. ఈ బస్సు కూడా అక్కడికే అదుగో దూరాన ఆ టూరింగు సినిమాదేరా. త్వరగా ఊళ్ళోకి నడిచి వెళ్ళాను. అక్కడ నా చంద్రం పాలెంలేదు మాఊరుపోయింది.—— ఈకొసమెరుపులో కాలమెంత మారిపోయిందో చమత్కారంగా ఆయన సూచించారు.

## 41

అహమ్మద్ నా వైపు చూడలేదు. రిక్షా ఎక్కాను. మువ్వల్లేవు దానికి. ఆ సాయం కాలం తెలిసింది అతని భార్యపోయిందని''. (రిక్షావాలా)

''నారయ్య కొడుకు మాత్రం చెప్పులు కుట్టడు పాలిష్‌వెయ్యడు చదువు కుంటున్నాడు. పాతచెప్పు వంటి నారయ్య గుడిసెకు ఎప్పటికైనా వాడే మాసి కలువేయాలి'' (బూట్‌పాలిష్)

కృష్ణశాస్త్రిగారు తన తెలుగును చెక్కుతారు. దానికి నగిషీ పెడతారు. మెరుగు పెడతారు. పద్యంలోనూ గద్యంనూ, కూడ ఆయన అభిరుచి మహాసున్నిత మైనది అన్నారు. పాలగుమ్మి పద్మరాజు. ''కృష్ణశాస్త్రి పదాలకు చిత్రికలు పడతాడు'' అన్నారు చలం రిక్షావాలా; బూట్‌పాలిష్ వంటి వచన రచనలు చదివినప్పుడే విషయం తేటతెల్లమవుతుంది.

మొదటిరోజున పరిచయమైనప్పుడు రిక్షావాలా అహమ్మద్‌ను చూచి ''ఏంపీడి నవాబుదర్జా'' అనుకున్నారు. తర్వాత అతడు బాగాపరిచయ మయ్యాక ''అహమ్మద్ చాలా ఉదాత్తుడు, పుట్టుతలోనే 'పాద్షా' అని తెలుసుకున్నారు. జనసమ్మర్దంలో వేగంగా, ఎవరులేనిచోట నెమ్మదిగా రిక్షాతొక్కటం అహమ్మద్‌కు సరదా! పెళ్ళయ్యాక తళతళలాడే కొత్తరిక్షా కొనుక్కున్నాడు. దాని మువ్వల మోత బహుశ్రావ్యంగా ఉండేవి. కాని ఒకనాడు ఆ మువ్వలు తీసేశాడు. తీరా ఎవరినో కనుక్కుంటే అతని భార్య చనిపోయిన సంగతి శాస్త్రిగారికి తెలిసింది.

చెప్పులు కుట్టే నారయ్య తెగిపోయిన పాతచెప్పులు ఇస్తే వెతికి వెతికి రంధ్రాలన్నీ చూపించి, కష్టపడి కుట్టి డబ్బు సంపాదిస్తాడు చెప్పుల సొంతదార్లు విసుక్కున్నా ఓరిమితో జవాబు చెప్తాడు.

''నారయ్యా, ఈ పని నీకు బాధగాలేదా'' అంటే చిన్న నవ్వునవ్వి, ఆ నారాయణమూర్తే అన్నిటికీ అన్నట్టు పైకొక్కసారి చూస్తాడు.

''నారయ్య కొడుకు చెప్పులు కుట్టడు. చదువుకుంటున్నాడు అని శాస్త్రిగారి ఆ పేదవాని జీవితం బాగుపడుతుందని ఆశించారు,

## 42

"వీరేశలింగం మంది, కోట్ల మంది-వ్యక్తికి కుటుంబుంది. ప్రజకు లేదు. వ్యక్తికిమతం ఉంది, జనానికి లేదు, వ్యక్తికి వయస్సు ఉంది, మందికి లేదు. మందికి జననమరణాలు లేవు ఉద్యమాలన్నీ కలిసి ప్రజవి అది జీవద్వాహిని. అది భాద్రపదంలో గోదావరి. నిత్యమూ జీవనము నింపుకుంటూ సాగిపోవటమే. వీరేశలింగం కేవలంప్రజకూడాకాదు. వీరేశలింగం మానవత.

కృష్ణశాస్త్రి కాల్పనికోద్యమంలో పుట్టిపెరిగిన కవి అయినా వీరేశలింగం గారితో ఆంధ్రలో ప్రారంభమైన మానవోద్యమంతో ఆయనకు సన్నిహిత సంబంధం ఉన్నది. వీరేశలింగంగారిని మానవోద్యమ ప్రవక్తగా ఆయన సంభావించారు.

"వీరేశలింగం నాస్తికాత్త్యంబకం, నవ్యాంధ్రజీవితం, అఖండగౌతమి. నూరేళ్ళ ఈమధ్య ఉన్న తెలుగు వారందరూ వారికి తెలియకుండా, తెలిసో వీరేశలింగంలో ఉన్నారు అందరూ, అందరూనూ! అని నొక్కి పలికారు శాస్త్రిగారు. వీరేశలింగంగారు సాధించిన మహత్తర విజయాలను గమనించి ఆశ్చర్యంతో ఆయన కార్యోత్సాహాన్ని ప్రశంసించారు. భయంకరమైన తీవ్రాతి తీవ్రమైన ఆ కార్యోత్సవంలో ఆయనకు మరణించటానికి తీరిక లేక పోయింది లేకపోతే ఆ శరీరం చిన్నతనంలోనే రాలిపోయి ఉండేది అన్నారు.

వీరేశలింగంగారి కార్యోత్సవం వెనుక ఆయనకు తోడూనీడా అయిన రాజ్యలక్ష్మమ్మగారి అండదండలను ప్రశంసిస్తూ కృష్ణశాస్త్రి ప్రత్యేక వ్యాసమే రాశారుట.

## 43

"ప్రస్తుతం ప్రకాశం మకాం మద్రాసు గవర్నరు భవనంలో. భక్తులైన పూజారులకు గాని స్వామి గర్భాలయం తలుపులు ఇదివరకు సడలేవికావు. ఇప్పుడు ముఖద్వారం తలుపులు మూతపడటమే మానివేశాయి ఎప్పుడూ వచ్చేప్రజా వెళ్ళే ప్రజానూ! తీర్థం.

వారిలో కాసూరి రంగడు. ఆలీబేగ్, అద్దేపల్లి అప్పడు, మస్తాన్, కింగ్‌ఆఫ్, డింగోల్ నవులూరి రమణయ్య, రాజమహేంద్రవరం బెస్తలూ కూడా ఉన్నారా? అనిపిస్తుంది. ఎందుకు ఉండగూడదు? వీళ్ళెవరో తెలుసునా? వీళ్ళందరూ ప్రకాశం బాల్యంలో స్నేహితుల్లు,

స్వేచ్ఛా ప్రియులైన కృష్ణశాస్త్రిగారు మనిషిలోని సాహసగుణాన్ని అపరిమితంగా ప్రేమిస్తారు. ఆయనకు నచ్చిన పుస్తకం ఆంధ్రకేసరి ప్రకాశంపంతులుగారి స్వీయచరిత్ర. ప్రకాశంగారు సత్యసంధులు. భయమన్నది ఆయన నిఘంటువులో లేదు. బాల్యంలో తానునుభవించిన బాధలు, చేసిన ఆకతాయి పనులు, కొట్లాటలు అన్నిటినీ దాచకుండ స్వీయచరిత్రలో వెల్లడించారు.

"కృష్ణశాస్త్రిలో కృష్ణపక్షం రాసినకవి ఒకమూల ఉన్నాడు మరొకమూల లోకాన్ని బాగా దగ్గరగా ఎరుగున్న గడసరి, మనుషుల్ని అన్నిరకాల వాళ్ళనీకొంటె చిరునవ్వుతో పరిశీలిస్తూ వాళ్ళంటే పిచ్చి ఇష్టంతో పడి చచ్చేసంఘజీవీ ఉన్నాడు. అని పద్మరాజుగారు భావించారు.

ప్రకాశంగారి బాల్యస్నేహితులైన కాసూరిరంగడు, ఆలీబేగ్ అద్దేపల్లి అప్పడు, మస్తాన్, కింగ్ ఆఫ్‌డింగోల్ నవులూరిరమణయ్య రాజమహేంద్రవరం బెస్తలూ ప్రకాశంగారి వ్యక్తిత్వాన్ని రూపొందించటంలో తోడ్పడినసంగతిని మరువకూడదంటారు కృష్ణశాస్త్రి. గద్దెమీదా గరికెనేలమీదా ఒకేరీవితో కూర్చోగలిగిన ప్రకాశంగారి హుందాను శాస్త్రిగారు మెచ్చున్నారు.

ప్రకాశం మనలాగ ఉంటాడు. మనలాగ చేస్తాడు. మనలాగ బాధపడ్డాడు. మనకు మించిన తెలివితేటలున్నా మన బుర్రలకి వాటిని రుద్దడు మనకు తెలియకుండానే వాటిని మనకోసం వినియోగిస్తాడు ప్రజానాయకుడి కుండవలసిన గుణాలన్నీ ప్రకాశంగారిలో ఉన్నాయని కృష్ణశాస్త్రి మెచ్చుకున్నారు.

## 44

## నవ్వులో శివుడున్నాడు

కృష్ణపక్షంలో ప్రవాసంలో దుఃఖాన్ని ప్రేమించి' దానికొక ఉన్నత స్థానాన్నొసగిన కృష్ణశాస్త్రి నిత్యజీవితంలో గొప్ప హాస్యప్రియులు 'విశ్వదాభిరామ వినురవేమ' మకుటంలో ఆయన రచించిన వేలాది పద్యాలు ఆయన హాస్యప్రియత్వానికి నిదర్శనాలు.

"వేద విద్య నాటి వెలుగె నశియించె
గారెబూరె పప్పుచారు మిగిలె

బుర్ర కరగి కరగి బొర్రగా మారెరా!
విశ్వదాభిరామ వినురవేమ.
ప్రొద్దుపోక బాబు బొబ్బిలి కథవిని
గోడమీద బల్లెమూడలాగి
ఒక్క కేక పెట్టి ఊసుకున్నాడయా!
తెల్లగోడ నలుపు వెల్లుల్లియే నలుపు
పాలునలుపు కాకిశాలు నలుపు
సెట్టిగారి యింట సెందురుడే నలుపు''

ఈ పద్యాలలో వర్ణించిన ... రీతులతో కులాలకు ఆయన ప్రాముఖ్య మివ్వరు. నవ్వి నవ్వించగల ... శాస్త్రిగారిలో పుష్కలంగా ఉన్నది. తనమీద తానే హేళనచేసుకోగలిగినంత ఎత్తుకు ఆయన ఎదిగారు.

ఆయన హాస్యం పన్నీ.. జల్లులాగ ఆహ్లాదపరుస్తుందేగాని పరుషంగా ఉండదు, వృద్ధులెవరికైనా శాస్త్రిగారిని 'పీరుఫలానా' అని పరిచయం చేస్తే "కంటి చూపు తగ్గింది బాబూ, చెవితేగాని తెలీదు నాయనా'' అని ఆ వృద్ధు లంటారు. దానికి శాస్త్రిగారు మీ... ఎంతో అదృష్టవంతులు. చెవితేతెలుస్తున్నది. చెప్పినా తెలియని వారు ఎందరున్నారో భారత దేశంలో "అంటారు వెంటనే. వారి సమయస్ఫూర్తికి ఎంతైనా నవ్వొస్తుంది.

నూజివీటి జమీందారుల పోషణలో కవులు కొందరు సుఖంగా ఆశ్రయాన్ని పొందుతున్న కాలంలో "మిగిలిన కవి మిత్రులంతా రాజా వారితోటలో గున్నమావి నీడలో కూర్చుని కవిత్వం రాసుకుంటున్నారు. నేను మాత్రం నాగిరజాల జుత్తుకు నూనె రాసుకుంటూ కూర్చునే వాణ్ణి'' అని గడుసుగా పలికేరు కృష్ణశాస్త్రి.

వట్లూడిన ము...లి పండితుల్ని గురించి "వారంతా విగ్గంతులు" అనే శ్లేషతో చమత్కారం వెలిగించారొక సారి.

సుకుమారమైన హాస్యం కృష్ణశాస్త్రిగారి వచన రచనలకు పెట్టని ఆలంకారం-ఓ లావుపాటి అబ్బాయిని చూపించి అతడు మేపులో ఆస్ట్రేలియా లాగున్నాడంటారు-మరొక మొద్దబ్బాయిని సుబ్బమ్మవ్వ పిల్లలు బండెక్కి తర్వాత పడిపోకుండ ఉండేటందుకు బిరడాలాగ బిగించానంటారు, "కవిత్వం రాస్తాడు వ్యా

వాడంటే వొద్దుబాబూ వద్దు. వెంఠనే మాన్పించెయ్యాలి. ముదిరితే మహాకష్టం. తనేరాగం అవీపెట్టి చమత్కృతాడా అభినయిస్తూ'' అనేసికడుపుబ్బ నవ్విస్తారు.

మనుష్యుల తత్వాన్ని చెప్తూ "కొందరు మొదట పెద్దవాళ్ళయి క్రమ క్రమంగా పసివాళ్ళయి పోతారు. వాళ్ళుహరించి కర్పూరంబాపతు, మరికొందరు మొదట చిన్నవాళ్ళుగా వుండి పరిమిలాను ఉవ్వెత్తుగా పెరిగిపోతారు. వాళ్ళు ఆయ కుండుంబాపతు-ఇహ కొందరు చప్పగా అణిగున్నట్టుండి గాలిపోసుకుని గుండ్రంగా లావుగా పెరిగిపోతారు, వాళ్ళున్నారే రబ్బరు బెలూను తాలూకు'' అంటారు.

సన్మానాల కోసం ఎగపడే వారిని హేళన చేస్తూ ''సన్మానాలకోసం దండల కోసం, అదే పనిగా ఒంటెలాగున మెడ చాచి ఉంచడం ఇబ్బందండీ! అవే వెతుక్కొని వస్తే కొంతఫరవాలేదు "అన్నారు'' పదిమందిలో కూర్చోబెట్టి పొగిడే స్తుంటే మొగం ఎలాగ పెట్టాలో, దానిమీద ఏ మందహాసం పొదిగివుంచాలో, ఎట్టి తీయని వినయం చూపించాలో ఆ Pose ఎంతసేపు అలాగ నిలిపి ఉంచాలో తెలియదని సన్మానాలు చేయించుకునే వారిని సొగసుగా ఎత్తిపొడిచారు.

"ఎవరైనా మంచివాడి గురించి చెప్పేటప్పుడు అతను పొత్తిగా, నిష్కారణంగా మంచివాడు'' అంటారాయన.

భావకవులను ఎవరైనా ఎగతాళి చేసినా ఆక్షేపించినా కోపం తెచ్చుకొనే వారు కారు. అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరుల పరశుధాటిని, అనంతపంతుల రామలింగస్వామిగారి శుక్లపక్షమును ఆయన ఆక్షేపించలేదు. కొత్త కవిత రాయటమే వారికి తగిన జవాబని చెప్పి, కాలం తమ పక్షాన ఉన్నదని ఋజువు చేశారు.

## కృష్ణశాస్త్రి జీవనవేదాంతం

నేను హృదయ వాదిని పరిహృదయవాదిని
నాకు కవిత్వం ప్రాణం
సంగీతం మరీని

అన్నిటికన్నా నాకు కావలసింది మనిషి అని కృష్ణశాస్త్రి తరచుగా అంటూ ఉండేవారు. ఆయన నిరంతర ఆశావాది. లోకమంటే వల్లమాలిన ఇష్టం. మనుషులంటే పిచ్చి ప్రేమ. ఎప్పుడూ చుట్టూమనుషులు ఉండాలని కోరుకునేవారు కొలువు తీర్చినట్లు కూర్చొని మిత్రులతో గోష్ఠిసల్పటం ఆయనకు మిక్కిలి ఇష్టమైనపని

దిగిరాను దిగిరాను దివినుండి భువికి అనేపంక్తి స్వేచ్ఛాగానము కావ్య ఖండికకు సంబంధించినదేగాని ఆయన సాహిత్యమంతటికీ వర్తింపజేయదగినదికాదు. మామూలు మాటలలోనే ఆయన కవిత్వం చెప్తున్నట్లనిపించేది. రచనలు ఎంతో తీర్చిదిద్దినట్లు మామూలు మాటలు స్థాయికి మించినట్లు ఉండాలని ఆయన కోరిక.

ఒక్కొక్కసారి చినుకులు టపటపా పడినట్లనిపిస్తాయి కాని ఆయన చెవులకు మాత్రం పాటపాటగా వినిపిస్తాయి. నిత్యమూ సామాన్య జనుల మాటలలోనుండి కవిత్వాన్ని ఏరు కోవాలనేది ఆయన అభిమతం. కవి అన్నవాడికి చెవిలోపల చెవి ఉండాలనేవారు. లోచెవితో విన్న మాటలను గుండెలలో పదిలపరుచుకొని తగిన సమయంలో దానిని ఉపయోగించాలనేవారు.

కవిత్వరచన ఆయనకొక తపస్సే. ఒక్కొక్కసారి రచన అంతా పూర్తయి, ఏ ఒక్కమాటో సరియైనది పడినట్లని పించకపోతే దాని కోసం ఎంత కాలమైనా నెలలు సంవత్సరాలైనా నిరీక్షించేవారు శబ్దం రంగూరుచీ వాసనా తెలిసిన కవి కావటం చేత ఆయన రచనలో పొల్లుమాటలకు తావిచ్చేవారుకారు.

విశ్వకవి రవీంద్రుడు కృష్ణశాస్త్రిగారికి ఆదర్శం. ఏ విస్మృత హాయనాన ఏ ఆషాఢ ప్రథమదివసాన వ్రాసితివయా మేఘదూతను అని రవీంద్రుడు కాళి దాసును ప్రశ్నిస్తే కృష్ణశాస్త్రి రవికవిని ఏ ఫాల్గుణ సంధ్యాసమయాన ఏ వైశాఖ పూర్ణిమా రజనీముఖాన నీ భావకావ్యాలను రచించితివయా అని మరీమరీ అడగాలని ఉంటుంది అన్నారు ఎప్పటికీవాడని పరిమళము చెడని కవిత్వం రచించిన కృష్ణ శాస్త్రిని మనసుమల్లెల మాలలనూ, కన్నుల వన్నెల డోలలనూ ఊగించిన కలికి పాటల కోయిలా ఎక్కడిది నీకీ కవిత అని అడగాలనిపిస్తుంది.

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి కృష్ణశాస్త్రిగారిని ప్రాచీన నవీన ప్రగతి వాదాల, త్రివేణీ సంగమంగా భావించారు. ఔను శ్రీ ఆరుద్ర తలచినట్లు.

"కొంత మందిది యువత
కొంత మందిది నవత
కృష్ణశాస్త్రిది కవిత"

తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పొంగాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3